Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 30 • 20-7-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# రాజీ నిజమైతే రాజకీయం సమాప్తం!

- సాక్షి పత్రికలో గత వారం రోజులుగా ప్రభుత్వంపై విమర్శలు తగ్గాయి.
- సాక్షి టీవీలో సిఎం పర్యటన ప్రత్యక్ష ప్రసారాలు.
- జగన్‌పై సిబిఐ కేసులు కాంగ్రెస్ కుట్ర కాదన్న మేకపాటి.
- రాజీ వల్ల జగన్‌కు జరిగే మేలేమిటి?
- వైకాపా కార్యకర్తల్లో అయోమయం.

కాంగ్రెస్‌తో జగన్ రాజీ నిజమా? రాష్ట్రంలో నడుస్తున్న చర్చ ఇదే ఇప్పుడు. భీకర పోరాటంతో కదన రంగంలో రంకెలు వేసే వైరి వర్గాలు రాత్రికి రాత్రి చెలిమిచేసుకొన్నాయంటే జనం నమ్మలేక పోతున్నారు. కానీ జరుగుతున్న సంఘటనలు చూస్తే అందులో ఎంతో కొంత నిజం వుంటుందేమో అన్పిస్తున్నది.

జగన్ పోరాటం రాష్ట్ర నేతలతో కాదు. నేరుగా సోనియాగాంధీతో. తన తండ్రి మరణం తర్వాత ముఖ్యమంత్రి పీఠం తనకు దక్కకుండా చేసిందన్న ఆక్రోశం ఆయనలో చాలా వుంది. అందుకే ఆమెను బహిరంగ సభలలో విమర్శించడంతో తృప్తి కలగక, తన సాక్షి టీవీ ఛానల్‌లో బారులో నృత్యం చేసే చవకబారు మహిళగా చిత్రిస్తూ కథనాలు ప్రసారం చేశారు. సోనియా అంటే జగన్‌లో ఎంత అక్కసుందో ఆ కథనాలు చూస్తే అర్థమైపోతుంది. అటువంటి సోనియాగాంధీతో ఇప్పుడు రాజీ అంటున్నాడు. అంత మార్పు ఎందువల్ల? దేనికోసం?

రాజకీయంగా చూస్తే సోనియాతో రాజీ అవసరం జగన్‌కు లేదు. జగన్‌తో రాజీ అవసరం సోనియాగాంధీకి చాలా వుంది. రేపటి ఎన్నికలలో అధిక భాగం ఎమ్పీ సీట్లు జగన్ గెల్చుకోవడం ఖాయమని ఉపఎన్నికలు రుజువు చేశాయి. దానితో రేపటి ఢిల్లీ సర్కారు కూర్పులో జగన్‌ది చాలా కీలక పాత్ర అవుతుంది. ఏ గొంతెమ్మ కోరిక కోరినా తీర్చడానికి బిజెపి, కాంగ్రెస్‌లు పోటీ పడతాయి. అంతటి మహత్తర అవకాశాన్ని వదలుకొని, ఇప్పటికిప్పుడు సోనియా శరణు జొచ్చాడంటే, భవిష్యత్తు అధికారం కంటే వర్తమాన జీవన సమస్య ముఖ్యమైనదై వుండాలి. అదేమిటో అందరికీ తెలుసు. జైలు జీవితం నుంచి విముక్తి జగన్ తక్షణ అవసరం. రాజీ అనేది నిజమే అయితే, దీనికంటే మరొక ప్రయోజనమేదీ వుండదు, వుండబోదు.

రాజీ అనేది ఒట్టి మాట అనుకోవడానికి లేదు. గత వారం రోజులుగా సాక్షి పత్రిక చూస్తే, అది నిజమనడానికి ఎన్నో సంకేతాలు కన్పిస్తున్నాయి. రాష్ట్రంలో విద్యుత్ సమస్య, కరవు సమస్య, రైతుల బ్రతుకు సమస్య వంటివెన్నో భీకర రూపం ధరించి వున్నాయి. మామూలుగా అయితే ఈ పరిస్థితులన్నిటికీ కాంగ్రెస్ ప్రభుత్వమే కారణమని సాక్షి విరుచకపడాలి. కానీ ప్రభుత్వాన్ని వదిలిపెట్టి, పరిస్థితుల మీద మాత్రమే వార్తలొస్తున్నాయి అందులో. సాక్షి టీవీ అయితే మరొక ముందడుగు వేసి, ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి చేపట్టిన ఇందిరమ్మ బాట కార్యక్రమాలను ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నది. కాంగ్రెస్ పట్ల జగన్ సానుకూలంగా వున్నాడని చెప్పడానికి ఇంతకంటే సంకేతం అవసరం లేదు.

రాష్ట్రపతి అభ్యర్థిగా ప్రణబ్ ముఖర్జీకి మద్దతు పలకాలని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ తీసుకొన్న నిర్ణయం కూడా చర్చకు దారి తీస్తున్నది. నిజానికి ఇందులో జగన్‌ను తప్పు పట్టవలసిన అవసరం లేదు. ఆయనకు అంతకంటే గత్యంతరం లేదు. సంగ్మా మైనార్టీ నేత అయినప్పటికీ, బిజెపి మద్దతు తీసుకొన్నాడు. సంగ్మాకు ఓటు వేస్తే, ముస్లిం మైనార్టీలకు తప్పుడు సంకేతాలు ఇచ్చినట్లు అవుతుంది. పెద్ద ఓటు బ్యాంకు నష్టపోవలసి వస్తుంది. ఎవరికీ ఓటు వేయకుండా తెలుగుదేశం పార్టీ వలె తటస్థంగా వుండిపోవచ్చు. కానీ దానికి జగన్ ఇష్టపడలేదు. ప్రజలు ఓటు హక్కు వినియోగించుకోవాలని ప్రబోధం చేసే రాజకీయ పార్టీలు ఓటు వేయకుండా మానుకోవడం తప్పని అయన అభిప్రాయం. రాజకీయాలలో అటువంటి విధాన పరమైన నిర్ణయాలు తీసుకొనే స్వేచ్ఛ అధినేతలకు వుంటుంది. అట్లా తీసుకొనే సాంప్రదాయం కూడా మెచ్చుకోదగినదే. అయితే రాజీ వదంతుల నేపథ్యంలో ఈ నిర్ణయం అనుమానాలను మరింత పెంచింది. ఆ నిర్ణయ ప్రకటన చేసే సమయంలో వైఎస్‌ఆర్ కాంగ్రెస్ అగ్రనేతలు మైసూరారెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డి మాట్లాడిన తీరు సందేహాన్ని మరింత ధృవపరిచింది. జగన్ మీద వున్న కేసులకు కాంగ్రెస్‌కు సంబంధం లేదని, జగన్ బెయిల్ న్యాయస్థానాల వ్యవహారం కాబట్టి అందులో కాంగ్రెస్ ప్రమేయం వుండదని చెప్పారు వారిద్దరూ. ఇప్పటి వరకు వైఎస్‌ఆర్ కాంగ్రెస్ అనుసరిస్తున్న విధానాలకు పూర్తి విరుద్ధ ప్రకటన ఇది. జగన్ మీద సిబిఐ కేసులు కాంగ్రెస్ కుట్ర అని పదే పదే చెప్తుండిన పార్టీ ఒక్కసారిగా మాట మారిస్తే అనుమానాలు తలెత్తడం ఆశ్చర్యమేమీ కాదు కదా?

కొరవ 14వ పేజీలో



# ఏది నీతి? ఏది అవినీతి?

వైఎస్ జగన్ కాంగ్రెస్‌తో రాజీ కుదుర్చుకొన్నాడన్న వదంతులు రాజకీయ వర్గాలలో రాజ్యమేలుతున్నాయి. గతవారం రోజులుగా సాక్షి పత్రిక వార్తా కథనాలు, సాక్షి టీవీ ప్రసారాలు చూస్తే ఈ పొగకు ఎక్కడో ఒక దగ్గర నిప్పు వుండే వుంటుందన్న సందేహాన్ని బలపరుస్తున్నాయి. ఏ చిన్న అవకాశం దొరికినా కాంగ్రెస్ పార్టీని, రాష్ట్ర ప్రభుత్వాన్ని తూర్పార బట్టే ఈ రెండు జగన్ ప్రసార సాధనాలు తమ తీరు మార్చుకొన్నాయి. రాష్ట్రంలో పెచ్చరిల్లుతున్న కరెంట్ కోత, కరవు పరిస్థితులు, వాటి వల్ల రైతులు ఎదుర్కొంటున్న కడగండ్లు, వాటిని ఎదుర్కోవడంలో ప్రభుత్వ వైఫల్యాలను ఎండగట్టవలసిన సాక్షి పత్రిక, టీవీ ఛానళ్ళు, ఆ అంశాలు తమ వార్తలలో కన్పడకుండా జాగ్రత్త పడుతున్నాయి. ముఖ్య మంత్రి ఇందిరమ్మ బాట కార్యక్రమాన్ని సాక్షి టీవీ ఛానల్ ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నది. ఒక్కసారిగా వచ్చిన ఈ అనూహిత మార్పును బట్టే జగన్ రాజీ ప్రయత్నం నిజమే అన్న అభిప్రాయాన్ని ధృవపరుస్తున్నది.

జమీన్‌రైతు

రాజీ అంటే ఏమిటి? ఎందుకు? రాజకీయంగా అయితే ఎవరితోనూ రాజీ చేసుకోవాల్సిన పరిస్థితులలో జగన్ లేడు. మొన్న జరిగిన 18 శాసన సభ స్థానాల ఉపఎన్నికలు ఆయనకు రాజకీయంగా వెయ్యేనుగుల బలాన్ని కల్పించాయి. జైలుకు పోయినా జనం జగన్‌తోనే వున్నారన్న నిజాన్ని నిర్ధారించాయి. ఆ ఫలితాలతో కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం నైతికంగా పరిపాలనా అర్హత కోల్పోయింది. 2014 ఎన్నికలలో అధికార పీఠాన్ని బంగారు పళ్లెంలో పెట్టి జగన్‌కు అందించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం సిద్ధంగా వున్నారన్న వాస్తవాన్ని తిరుగులేని రీతిలో నిరూపించిన ఎన్నికలవి. అందుకు కారణం కాంగ్రెస్ ప్రభుత్వం పైన జనంలో వున్న ఆక్రోశం, అక్కసు, అసంతృప్తి. జగన్ ఒక్కడే ఈ పరిస్థితులను మార్చగలడన్న విశ్వాసం. వాటికంటే ముఖ్యంగా వైఎస్.రాజశేఖర్ రెడ్డి తమకు చేసిన ఉపకారాలకు కృతజ్ఞత చెల్లించుకొనే అవకాశాన్ని జగన్ గెలుపు ద్వారా మాత్రమే కోట్లాది ప్రజానీకం చూస్తున్నదన్న నిజం. జన ఆకాంక్షలకు తగినట్లే జగన్ కూడా కాంగ్రెస్ సర్కారుపై రాజీలేని ధోరణిలో పోరాటం జరుపుతున్నాడు. ఎన్ని కేసులు, ఎన్ని వేధింపులు ఎదురైనా లెక్క చేయకుండా, కాంగ్రెస్ అధినాయకత్వంపై ధిక్కార స్వరం విన్పిస్తున్నాడు. ఆ వైఖరి జనానికి బాగా నచ్చింది. జగన్‌లో ఒక పోరాట యోధుడిని దర్శించారు ప్రజలు.

ఈ నేపథ్యంలో జగన్, కాంగ్రెస్ పార్టీల మధ్య రాజీ అనే వార్త ప్రజలను తీవ్రంగా కలవర పరుస్తున్నది. రాజీ అంటే ఏమిటి? ఎందుకు? ఇవేమీ పెద్దగా మథన పడవలసిన ప్రశ్నలు కావు. జగన్‌కు జైలు జీవితం నుంచి విముక్తి కావాలి. కాంగ్రెస్‌కు చేజారిందనుకొంటున్న పాలనాధికారం కావాలి. రాజీ షరతులేవైనా ప్రాతిపదిక మాత్రం వీటికి సంబంధించే వుంటుందని పసి పిల్లవాడు కూడా చెప్పగలడు. సిబిఐ ఇప్పటికే మూడు ఛార్జిషీట్లు దాఖలు చేసినా, జగన్ మీద వున్న ఆరోపణలలో తీవ్రమైన అంశాలు వాటిలో ప్రస్తావనకు రాలేదు. కలకత్తా సూట్‌కేస్ కంపెనీలు, మారిషస్ లావాదేవీలు, మనీ ల్యాండరింగ్, జగన్ కట్టుకొన్న వందలాది కోట్లు విలువ చేసే భవంతులు వంటివన్నీ ఈ ఛార్జిషీట్లలో లేవు. ఇకపై వేసే ఛార్జిషీట్లలో ఈ అంశాలు ముందుకు వస్తాయి. అవి వెలుగు చూస్తే, వాటికి ఆధారాలు కోర్టుకు సమర్పిస్తే జగన్‌కు శిక్ష పడడం ఖాయమన్న భావన న్యాయనిపుణులలో వుంది. ప్రజా ప్రాతినిధ్య చట్టం ప్రకారం క్రిమినల్ కేసులలో రెండేళ్లకు పైబడి శిక్ష పడితే, ఎన్నికలలో పోటీ చేయడానికి అర్హత కోల్పోతారు. ఆ ప్రమాదం లేకుండా చూసుకోవడం జగన్ ముందున్న అతి పెద్ద సవాలు.

కాంగ్రెస్ పక్షంగా చూస్తే, 42 ఎమ్పీ స్థానాలున్న ఆంధ్రప్రదేశ్‌లో భవిష్యత్తు అంధకారమయంగా కన్పిస్తున్నది. ఇక్కడ తగ్గే సీట్లు, అక్కడ ఢిల్లీలో మళ్లీ గద్దె ఎక్కే అవకాశాన్ని దిగజార్చి వేస్తాయి. ఈ రాష్ట్రాన్ని కాపాడుకోవడం కాంగ్రెస్ ముందున్న అతి పెద్ద సవాలు. రాజీ అనేది నిజమైతే ఈ రెండు అవసరాలు తీరే విధంగా వుంటుంది.

దాని అర్థం ఏమిటి? సిబిఐ దర్యాప్తు, పలు రకాల చట్టాలు, వివిధ న్యాయస్థానాలు, వాటిలో జరిగే వాదనలు అన్నీ బూటకమనే అర్థం రావడం లేదా? అధికారంలో వుండే వారు తలచుకొంటే చట్టాలు చుట్టాలుగా మారి పోతాయన్న నానుడి నిర్ధారణ కావడం కాదా? ప్రజలు దేన్ని నమ్మాలి? దేనిపైన విశ్వాసం వుంచాలి? ప్రజాస్వామ్య వ్యవస్థ సమస్తం పరిహాసం పాలైపోతే దేశంలో ఇక మిగిలేది ఏమిటి? ఈ మొత్తం వ్యవహారంలో ఏది నీతి? ఏది అవినీతి?

## జనవాణి

### రైతులకు అండగా నిలవండి!

రాష్ట్రంలో ఖరీఫ్ సీజన్ వచ్చింది. సేద్యం సజావుగా సాగాలంటే సాగు నీరు, విత్తనాలు, ఎరువులు, పెట్టుబడి అవసరం. వీటిని అందించడంలో రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా విఫలమయ్యింది. రిజర్వాయర్లలో నీటిమట్టం పడిపోయిందని, సాగునీరు ఎప్పుడు విడుదల చేస్తామో చెప్పలేమని ప్రభుత్వం, ఇరిగేషన్ అధికారులు మాట్లాడుతున్నారు. దీనికితోడు విత్తన కొరత, నకిలీ విత్తనాల సమస్య రైతులను వెంటాడుతున్నది. పాలకులు అమలుచేస్తున్న విధానాల వల్ల ఎరువుల ధరలు ఆకాశాన్ని అందుకొంటూ ఉండడం, సేద్యపు ఖర్చులు పెరగడం రైతాంగానికి సమస్యగా మారింది. రైతులను ఆదుకోను ప్రభుత్వం ముందుకు రావాలి.

ఎం.రమణయ్య — కోవూరు

### రాష్ట్రంలో ప్రభుత్వం ఉందా?

'జమీన్‌రైతు' జులై 6వ తేది సంచికలో 'ప్రభుత్వ మొద్దునిద్ర' శీర్షికతో వెలువడ్డ సంపాదకీయం ఆలోచింపజేసింది. రాష్ట్రంలో ఏ విషయాన్నీ నియంత్రించను ప్రభుత్వ పెద్దలకు చేతకావడం లేదు. కొన్నిసార్లు అసలు రాష్ట్రంలో ప్రభుత్వం ఉందా అనే సందేహం కలుగుతుంది. పరిపాలనాదక్షులు మంత్రులు, ముఖ్యమంత్రులుగా లేకుంటే ఇటువంటి దౌర్భాగ్యస్థితి వస్తుంది.

సి.గోపీనాథ్ — నెల్లూరు

### పోలీసుల చేత కూడా చేయించవచ్చు!

మనీ ల్యాండరింగ్ వంటి ఆర్థిక నేరాలను సిబిఐ మాత్రమే ఎందుకు దర్యాప్తు చేయాలి. మన సివిల్‌పోలీసుల చేత కూడా చేయించవచ్చుగా? స్పెషల్ యాక్ట్ క్రింద వచ్చే ఎన్నో కేసులను మన పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. ఐపిసిలో పొందు పరచిన నేరాలతోపాటు ఇటువంటి స్పెషల్ యాక్ట్ క్రింద ఉండే నేరాలను కూడా సివిల్ పోలీసులు దర్యాప్తు చేసేలా ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేయాల్సిన అవసరం ఉంది.

టి.కోటేశ్వరరావు — కోవూరు

### విద్యుత్ ఉత్పత్తి పెంచాలి!

థామస్ ఆల్వా ఎడిసన్ తన ప్రయోగంతో విద్యుత్ బల్బు ఆవిష్కరణకు శ్రీకారం చుట్టారు. ఇలాంటివి ఎన్నో సాంకేతిక పరిజ్ఞాన ఫలితాల వల్ల నేడు వందల కొద్దీ విద్యుత్ ఉపకరణాలు అందుబాటులోనికి వచ్చాయి. కానీ వీటికి తగ్గట్లు విద్యుత్ సరఫరా అందుబాటులో లేదు. దీనికి కారణం ప్రభుత్వానికి ముందు చూపు లేకపోవడమే. మన అవసరాలకు తగ్గట్లు విద్యుత్ ఉత్పత్తికి నేటికీ ప్రభుత్వం వద్ద తగిన ప్రణాళికలు లేవు. మన రాష్ట్రంలో రిలయన్స్ గ్యాస్ ఉత్పత్తి చేస్తూ మనకు గ్యాస్ ఇవ్వదు. జల విద్యుత్ ఉత్పత్తి కష్టమనుకొన్నప్పుడు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

24-7-1942
పేజీలు : 8 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు
### కాలేజి రాజీనామాలు

అసలు ఫస్టు గ్రేడు కాలేజి చేయడం రాజాకు యిష్టం లేదు. ఎందువల్లనంటే డబ్బు తాము యివ్వడానికి కాదు. మరొకరు యిస్తే తమ ప్రతిష్టకు నామోషీ. దాన్ని కప్పిపుచ్చడానికి దండాయుధపురాన్నుంచి ఎన్నో సర్కసులు చేస్తున్నారు. ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ, టక్కుటమారాది విద్యలు అనంతంగా ఉన్నాయి నాయనా!

కాలేజి కమిటీ నుండి రాజాగారి సభ్యులు నలుగురిలో ముగ్గురు రాజీనామా యిచ్చారు.

“రాజా గారు ఈ కాలేజి సంబంధం వదలుకొని నాయుడుపేటలో అగ్రికల్చరల్ కాలేజి పెడతారు” అని వెంకటగిరి కీరశారికలు గానం చేస్తున్నవి. ఇది నిజమైతే మా ఊహ అక్షరాల సరిపోయినట్టే.

### పబ్లిక్ ప్రాసిక్యూటరీ కన్య!

మాలె కొండారెడ్డి గారు ఈమెకు విడాకులిచ్చారు. ఇహ ఈ కన్య ఎవర్ని వరిస్తుందో? సమర్థుడైనా ఆమె మీద ఇచ్చలేని విశ్వనాథరావును వరిస్తుందా? కల్ల! వెంకటరత్నం నాయుడు నాకొద్దు బాబో అంటూంది. పున్నయ్య 52 ఏండ్ల వృద్ధుడు. మూడేండ్లకు పైన కాపురం చేసే అర్హత లేదు అంటుందేమో? శ్రీనివాసులు నాయుడు, రెడ్డిగారి వద్ద అన్ని విషయాలు నేర్చుకున్నాడు కానీ “నీవు బాలుడివి బతికుంటే ఆవల చూస్తామని”ని పేజీ తిప్పుతుందేమో? ఇహ గాలిస్తే శ్రీహర్షుని పిత ఒక్క జానకి సంగం రామయ్య కనపడుతున్నాడు. 40 ఏండ్ల వయస్సు, నల్లగా ఉన్నా చక్కని రూపం, కవి, గాయకుడు, జర్నలిస్టు, ఐడియాలజిస్ట్ క్రిమినల్ కోర్టుల వ్యవహారమంతా అగస్త్యుని మాదిరి 'దిగ ద్రావి గుర్రున త్రేచినవాడు పొన్నలూరు లక్ష్మీనర్సారెడ్డి చేతుల్లో లోక వ్యవహార ధర్మజ్ఞత నేర్చుకొన్న ప్రజ్ఞాశాలి, వీరిని కాదంటుందా?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

20-7-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### “స్టాలిన్ ఒట్టి శుంఠ”

ఇటీవల ఆస్ట్రియా అధ్యక్షుడు రష్యాను సందర్శించినపుడు మాటల సందర్భంలో కృషేవ్ ఆయనతో 'స్టాలిన్' ఒట్టి శుంఠ(ఫూల్)' అని అన్నాడట. ప్రస్తుతం వ్యవసాయ రంగంలో రష్యా ఎదుర్కొంటున్న కష్టాలకు కారకుడు స్టాలినేనని, అవి స్టాలిన్ హయాం నుండి అనువంశికంగా వచ్చినవేనని కూడా కృషేవ్ అన్నాడట. స్టాలిన్‌ను దూషించినందుకు, వారి భౌతిక కాయాన్ని భూస్థాపితం జేసినందుకు ఆగ్రహ పడి ఆ మృత దేహాన్ని తమకిచ్చినా భద్రపరచుకొని పూజించుకుంటామని చెప్పిన భారత కమ్యూనిస్టులకు ఇది ఎంత బాధ గలిగించగలదో! మొత్తానికి చనిపోయిన స్టాలిన్ మీద కృషేవ్ తన అక్కసంతా వెళ్లబోసుకుంటున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు
### ఆనం మధ్యముని ఐరోపా యాత్ర!

ఆనం మధ్యముడు అంటే మంత్రి ఏ.సి.సుబ్బారెడ్డి గారి రెండవ కుమారుడు – ఆనం భక్తవత్సలరెడ్డి ఫిన్లాండు యువజన సంఘాల ఆహ్వానంపై ఆంధ్ర యువజన కాంగ్రెస్ ఏకైక ప్రతినిధిగా ఆ దేశానికి 20వ తేది విమానం ఎక్కుటకుగాను 17వ తేది ఢిల్లీ బయలుదేరి పోయారు. భక్తవత్సలం ఫిన్లాండే గాక ఇతర యూరప్ దేశాలను, పోలెండు, రష్యా వగైరా కమ్యూనిస్టు రాజ్యాలను; బాల్కన్ రాజ్యాలను గూడా సందర్శించగలరట. వీరి తమ్ముడు సురేంద్రనాథరెడ్డి ఇటీవల యుగోస్లేవియాకు పోయిన విషయం పాఠకులకు తెలిసినదే. ఎసి ఇది వరకు యుగోస్లేవియా, మలయా, సిలోన్ వగైరా దేశాలలో పర్యటించారు. ఇక వారి పెద్ద కుమారుడైన వెంకట సుబ్బారెడ్డి ఒక్కడుంటాడు దేశాంతరాలకు పోని వ్యక్తి. అతనికి గూడా ఏదో ఒక ప్రాతినిధ్యం లభిస్తే ఏ.సి కుటుంబం పూర్తిగా విదేశీ పర్యటనానుభవపరులవుతారు.

# నెల్లూరు ముచ్చట్లు

[illegible]

## చినుకులు రాల్చిన వరుణుడు!

తాను విచిత్ర వేషధారణ వేసింది చాలదంటూ జిల్లా కలెక్టర్ చేత కూడా విచిత్ర వస్త్రాలు కట్టించి వివేకానందరెడ్డి మూలస్థానేశ్వరస్వామి దేవస్థానంలో చేయించిన వరుణ యాగానికి ఓ మోస్తరు ఫలం దక్కినట్లుంది. రెండు రోజులపాటు వివేకా బృందం చేసిన హంగామాకు వరుణుడు సైతం దడచినట్లున్నాడు. 14వ తేది వరకు ఒకటి అరా చినుకులు రాల్చిన ఆయన 15, 16 తేదీల్లో బిగదీశాడు. కానీ 18వ తేది అర్థరాత్రి తర్వాత చినుకులు రాలాయి. ఇదసలు వరుణ యాగం కాదని వివేకానందరెడ్డి చిడిపోను చేయించుకొన్న యాగమన్న గుసగుసలు విన్పిస్తున్నాయి.

## ధైర్యం చేసిన తూనికలు, కొలతల శాఖ!

పాత రోజుల్లో తూనికలు, కొలతల శాఖ ఇన్స్‌పెక్టర్లు వస్తున్నారంటే బజారులో అక్రమ వ్యాపారాలు చేసే వాళ్ల అంగళ్లు మూతబడేవి. ఇప్పుడు దీనికి విరుద్ధంగా జరుగుతుంది. నెల్లూరు తూనికలు, కొలతల శాఖ ఇన్స్‌పెక్టర్ నాగేశ్వరరావు 15వ తేది మొండి ధైర్యంచేసి డైకస్‌రోడ్డులోని చేపల మార్కెట్‌పై దాడి చేశారు. ఆయన్ను చూసి తప్పుడు తూకాలు తూసే చేపల వ్యాపారులు పరుగులు తీశారు. అయినా ఆయన వదలలేదు. వెంటపడి 25 కాటాలు స్వాధీనం చేసుకొన్నారు. పది మందిపై కేసులు నమోదు చేశాడు. మార్కెట్ చుట్టు ప్రక్కల మాంసం అంగళ్లపై ఈ దాడులు కొనసాగించాడు. ఇక్కడా పది కాటాలు తప్పుడు తూకాలు తూసేవే. ఎసి కూరగాయల మార్కెట్‌లోనూ నాగేశ్వరరావు బృందం 16వ తేది దాడులు కొనసాగించింది. ఎంత ధైర్యం లేకుంటే ఇంత మంది కూరగాయలు, చేపలు, మాంసం విక్రేతలు తప్పుడు తూకంతో వ్యాపారం చేస్తారు. నాగేశ్వరరావు గారూ ఈ దాడులు చేపలు, మాంసం మార్కెట్‌లలో తప్పుడు తూకాలు ఆగే వరకు చేయండి సార్! మీకు ప్రజలు మద్దతు ఇస్తారు.

## బ్యాంకుల వద్ద దోపిడీ దొంగలు దొరికారు!

నెల్లూరు నగరంలోని బ్యాంకుల వద్ద మాటువేసి కోటి రూపాయలకు పైగా మొత్తాన్ని గత ఐదారేళ్లుగా దోచుకొంటున్న ముఠాలోని నలుగురు సభ్యులను క్రైమ్ పోలీసులు అదుపులోకి తీసుకొన్నారు. నిప్పో సెంటర్‌లోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వద్ద ఈ ముఠా సభ్యులు దొరికారట. వీరు తమిళనాడు వాస్తవ్యులట. వీరిని విచారిస్తున్నారు. ఇంకా ఎంతమంది ఉన్నారో దర్యాప్తులో గానీ తేలదు.

## పెద్దాసుపత్రికి కొత్త సూపరింటెండెంట్

నెల్లూరు పెద్దాసుపత్రి సూపరింటెండెంట్‌గా డాక్టర్ సుబ్బారావు 16వ తేది బాధ్యతలు స్వీకరించారు. ఈయన రేబాల వారివీధిలోని చిన్నపిల్లల ఆసుపత్రి సూపరింటెండెంట్‌గా పనిచేసేవారు. మూడేళ్లకు పైగా నెల్లూరు పెద్దాసుపత్రికి రెగ్యులర్ సూపరింటెండెంట్ లేరు. డాక్టర్లు పెంచలయ్య, రమణయ్య, శ్రీధర్‌రెడ్డిలు ఇన్‌ఛార్జిలుగా ఇన్నాళ్లు నెట్టుకొచ్చారు. సుబ్బారావు గారికి డాక్టర్‌గా మంచి పేరుంది. సూపరింటెండెంట్‌గా ఎలా పనిచేస్తారో వేచి చూడాలి.

## బారాషహీద్ దర్గా అభివృద్ధికి రూ.10 కోట్లు!

హిందూ – ముస్లింల మధ్య మత సమైక్యతకు ప్రతీకగా నిలిచే నెల్లూరు బారాషహీద్ దర్గా వద్ద అభివృద్ధి పనులు చేపట్టేందుకు ప్రభుత్వం పది కోట్ల రూపాయలు మంజూరు చేసినట్లు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి చెప్పారు. రంజాన్ పండుగ ముందస్తు ఏర్పాట్లపై కార్పొరేషన్ కార్యాలయంలో ముస్లిం పెద్దలతో ఏర్పాటుచేసిన సమీక్షా సమావేశంలో ఎమ్మెల్యే ఈ ప్రకటన చేశారు. ముస్లిం విద్యార్థుల కోసం ప్రత్యేకించిన మదరసాలలో అభివృద్ధి పనులకు సైతం 30 లక్షల రూపాయలను ముఖ్యమంత్రి మంజూరు చేసినట్లు వివరించారాయన.

## నాగమాంబనా... మజాకానా?

మహిళలు అవినీతికి అలవాటు పడితే ఎలా ప్రవరిస్తారన్నదానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచింది జిల్లా ఖజానా అధికారిణి నాగమాంబ. పోలీసులకు సంబంధించిన సరెండర్ లీవుల బిల్లులు చెల్లించను ఆమె తనకు ఏసి ఇవ్వమని, ప్రతినెలా తన కారుకు 50 లీటర్ల డీజిల్ పట్టించమని గట్టిగా అడిగింది. ఈ వ్యవహారమై ఆమెతో తాడోపేడో తేల్చుకోవాలని 16వ తేది కలక్టరేట్ ప్రాంగణంలోని ట్రెజరీకి వెళ్లిన పోలీసు అధికారుల సంఘం నేతలు శ్రీహరి, మాధవరెడ్డితో గట్టిగా మాట్లాడిన ఆమె పాత్రికేయులు రంగ ప్రవేశం చేయడంతో కాస్త తగ్గింది. తానెవరినీ ఎసిలు, డీజిల్ అడగలేదని వివరణ ఇచ్చింది. 2500 మంది పోలీసులకు 2.5 కోట్ల రూపాయల సరెండర్ లీవుల బిల్లులు మంజూరు చేయాల్సి రావడంతో ఖజానా శాఖలో మామూలు అలవాటు ప్రకారం నాగమాంబ లంచం డిమాండ్ చేసింది. ఎసిబికి పట్టిస్తే సమస్యలొస్తాయని మహాఘటికులైన శ్రీహరి, మాధవరెడ్డిలు పాత్రికేయులను రంగంలోకి దింపి ఈ పనిచేయించుకొన్నారు.

## సుబ్బరామిరెడ్డి సంప్రదింపులు

నెల్లూరు ప్రజలు మొన్న జరిగిన పార్లమెంటు ఉప ఎన్నికల్లో తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని ఓడించినా ఆయన చేసిన వాగ్దానాలు నెరవేర్చడం కోసం ఢిల్లీలో సంప్రదింపులు మానడం లేదు. మెట్ట ప్రాంతీయుల ఆశాదీపం నడికుడి – శ్రీకాళహస్తి రైల్వేలైను నిర్మాణ విషయమై 14వ తేది కేంద్ర రైల్వే శాఖా మంత్రి ముకుల్‌రాయ్, రైల్వే బోర్డు ఛైర్మన్ వినయ్ మిట్టల్‌ను కలసి చర్చించారు. ఈ పనికి నెల్లూరు వచ్చి రెండు నెలల్లో శంకుస్థాపన చేస్తానని రైల్వే మంత్రి హామీ ఇచ్చినట్లు టిఎస్‌ఆర్ స్పష్టం చేశారు.

నెల్లూరులో ప్రభుత్వ మెడికల్ కాలేజి ఏర్పాటుకు సంబంధించిన ఫైలును సైతం రాష్ట్ర ప్రభుత్వం నుంచి తీసుకున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డి 15వ తేది మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఉన్నతాధికారులను కలసి తక్షణ మంజూరీ ఆవశ్యకతను తెలియజేశారు.

## 200 రోజులు పని చూపాలి!

గ్రామీణ ఉపాధి హామీ మేట్ల సంఘం జిల్లా సదస్సు 15వ తేది జిల్లా పరిషత్ మీటింగ్ హాల్‌లో జరిగింది. సదస్సుకు ముఖ్య అతిథులుగా డ్వామా పిడి గౌతమి, ఉపాధి మేట్ల సంఘం రాష్ట్ర కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు మాజీ ఎమ్మెల్యే జక్కా వెంకయ్య హాజరయ్యారు. ఈ సందర్భంగా రాష్ట్ర కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ ఉపాధి హామీ చట్టం గ్రామీణ ప్రాంతాల్లో క్షేత్రస్థాయిలో పనిచేస్తూ కీలకపాత్ర పోషిస్తున్న మేట్లకు కల్పించాల్సిన సౌకర్యాలపై ప్రభుత్వం చిన్నచూపు చూస్తుందన్నారు. మేట్ల హక్కుల సాధనకు మేట్లందరూ ఐక్యంగా పోరాడాలని, ఉపాధి సక్రమంగా అమలు జరిగే విధంగా కృషి చేయాలన్నారు. కూలిచేసే వారికి రోజుకు 200 రూపాయలు ఇచ్చి రెండు వందల రోజులు పని చూపించాలన్నారు. మేట్లకు సెల్‌ఫోను, సైకిల్, టేపు లాంటి కిట్స్‌తోపాటు గుర్తింపు కార్డులివ్వాలన్నారు. ఈ సదస్సుకు ఎం.పుల్లయ్య అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో వ్యవసాయ కార్మిక సంఘం జిల్లా కార్యదర్శి టి.మాల్యాద్రి, నాయకులు ఎ.తిరుపాలు, కె.రమణమ్మ, జి.మస్తానయ్య, గోపి తదితరులు పాల్గొన్నారు.

## రోటరీ క్లబ్ నెల్లూరు సౌత్!

రోటరీ క్లబ్ నెల్లూరు సౌత్ నూతన కార్యవర్గ ప్రమాణ స్వీకారోత్సవం నెల్లూరు మినీబైపాస్ రోడ్డులోని పద్మావతి కళ్యాణ మండపంలో 15వ తేది జరిగింది. రోటరీ క్లబ్ జోన్ వన్ అసిస్టెంట్ గవర్నర్‌గా నేతాజి పైలెట్ స్కూల్ అధినేత సుబ్బారెడ్డి, అధ్యక్షులుగా రిటైర్డ్ ఆర్మీమేజర్ ఎం.వెంకటాద్రిరెడ్డి, ఉపాధ్యక్షులుగా అమరావతి హోటల్ అధినేత జి.కృష్ణారెడ్డి, కార్యదర్శిగా సి.హెచ్.నరసింహారావు ప్రమాణ స్వీకారం చేశారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన రోటరీ మాజీ గవర్నర్ దొడ్ల భరత్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ రోటరీ క్లబ్ బాధ్యతలు తీసుకొన్న ముగ్గురూ మూడూ రంగాల్లో ప్రముఖులు కావడం ఎంతో ఆనందంగా ఉందన్నారు.

## టి.జి.వెంకటేష్ రాజీనామా చేయాలి!

ఐఏఎస్‌లను నడిరోడ్డుపై కాల్చి పారేయాలన్న మంత్రి టి.జి.వెంకటేష్ తన మంత్రి పదవికి రాజీనామా చేయాలని ఎపి స్టేట్ బిసి, ఓసి ఎంప్లాయిస్ వెల్ఫేర్ అసోసియేషన్ రాష్ట్ర ఉపాధ్యక్షుడు డిమాండ్ చేశారు. మంత్రి చెప్పినంత మాత్రాన రూల్‌కు అతీతంగా ఏ అధికారి కూడా పనిచేయడన్న సత్యాన్ని మంత్రి తెలుసుకోవాలని చంద్రశేఖర్ స్పష్టం చేశారు.

## అవినీతి మంత్రులకు న్యాయ సహాయమా?

నెల్లూరు న్యాయవాది పి.సుధాకర్ రెడ్డి రాష్ట్ర మంత్రులపై సుప్రీంకోర్టులో దాఖలు చేసిన పిటిషన్‌పై మంత్రులకు ప్రభుత్వం న్యాయ సహాయం అందించాలన్న నిర్ణయం సమంజసం కాదని సమాచార హక్కు – సామాజిక పర్యవేక్షణ సమితి స్పష్టం చేసింది. అవినీతి మంత్రులకు ప్రభుత్వం న్యాయ సహాయం అందించడం పరువు తక్కువని వాస్తు రామచంద్ర, దామా చెంచయ్య, చల్లా యానాదయ్య, గొరినేని వెంకయ్య ఒక ప్రకటనలో ఆవేదన వ్యక్తం చేశారు.



## జీవప్రదాతకు సజలనయన ప్రణామం!



**20వ తేదికి 19 సంవత్సరాలు గడుస్తాయి - ఈ 19 సంవత్సరాలు పంతొమ్మిది యుగాలుగా కన్పిస్తున్నాయి. తుది శ్వాస విడిచే వరకు పత్రికా సంపాదకత్వమే తన ప్రాణంగా భావించి, పత్రిక భవిష్యత్తు కోసం జీవితం పణంగా పెట్టిన జమీన్‌రైతు జీవప్రదాత నెల్లూరు శ్రీరామమూర్తి గారి ఎడబాటు - ఎన్నేళ్లు గడిచినా దుర్భరంగానే కన్పిస్తున్నది. 19వ వర్థంతి సందర్భంగా సజల నయనాలతో ఆయన్ను స్మరించుకొంటున్నాము; ప్రణమిల్లు తున్నాము.**

**- జమీన్‌రైతు కుటుంబం**

## కొత్త సిపిఓ

నెల్లూరు జిల్లా ముఖ్య ప్రణాళికాధికారిగా పి.బాలకృష్ణమూర్తి 13వ తేది బాధ్యతలు స్వీకరించారు. ఈయన కావలి ప్రాంతీయుడు కావడం విశేషం.

## పురుగులతో సతమతం

వెంకటేశ్వరపురం ఎఫ్‌సిఐ గోడౌన్ల సమీపంలో నివాసం ఉండే ప్రజలు పురుగులతో సతమతం అవుతున్నారు. ఇస్లాంపేట, మసీదువీధి తదితర ప్రాంతాలలో కొన్ని రోజులుగా ఒక రకమైన

కొరవ 14వ పేజీలో

# [illegible]

జిల్లాలోని నిరుపేద విద్యార్థులకు ఇంటర్మీడియట్ చదువు కార్పొరేట్ కాలేజిల్లో చెప్పించను కలెక్టర్ ఆలోచనల్లో మెదిలిన పథకమే సరస్వతి నిధి. కలెక్టర్ ఈ పథకానికి సాయం చేయమని ప్రకటించిన వెంటనే పలువురు దాతలు స్పందించారు. తమ శక్తి మేర విరాళాలను జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డికి అందించారు. మొత్తం మీద కోటీ 80లక్షల రూపాయలు ఈ పథకానికి మూలనిధిగా సమకూరింది. విద్యార్థులను ఇంటర్మీడియట్ కోర్సుల్లో చేర్పించను ఈ వారంలో నెల్లూరులోని డిఆర్‌డిఏ కార్యాలయంలో కౌన్సిలింగ్ కూడ నిర్వహించి ఎస్సీ, ఎస్టీ తరగతులకు చెందిన 45 మంది విద్యార్థులను ఎంపిక చేశారు. మరికొంత మందిని ఎంపిక చేయాల్సి వుంది. అంతా బాగానే ఉన్నా హాస్టల్‌లో వుండి ఇంటర్మీడియట్ చదవను నెల్లూరులోని కార్పొరేట్ విద్యాసంస్థలకు ఒక్కో విద్యార్థికి సంవత్సరానికి 45వేల రూపాయలు చెల్లించాలని అధికారులు నిర్ణయం తీసుకోవడమే సబబుగా లేదు. ఎం.పి.సి, బైపిసి కోర్సులకు సాధారణ విద్యార్థులకు సైతం అన్ని కార్పొరేట్ కళాశాలలు 35వేల నుంచి 40వేల రూపాయలను ఫీజుగా వసూలు చేస్తున్నాయి. దాతల సహాయం చేసిన పథకం కాబట్టి 30వేలకు విద్యార్థులను చేర్పించను ఒత్తిడి చేయాల్సిందిపోయి 15వేల రూపాయలు అదనంగా చెల్లించను సిద్ధపడడం విమర్శలకు తావిస్తుంది. వదాన్యుల సాయాన్ని కార్పొరేట్ విద్యాసంస్థలకు ధారబోసినట్లువుతుంది. ఇప్పటికైనా ఈ వ్యవహారాన్ని పర్యవేక్షిస్తున్న అధికారులు ఈ విషయమై మరోసారి కార్పొరేట్ స్కూళ్ల యాజమాన్యాలతో చర్చిస్తే బాగుంటుంది. లేకుంటే దాతల సహాయం బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.

**● సరస్వతి నిధి నిధులు బూడిదపాలు!**

## బిసిలు టిడిపికి అండగా నిలవాలి!

**నూనె మల్లిఖార్జున యాదవ్ పిలుపు**

వెనుకబడిన తరగతుల వారిని అన్ని రకాలుగా ఆదుకొన్న తెలుగుదేశం పార్టీకి బిసిలు అండగా నిలవాలని తెలుగుదేశం పార్టీ నగర ప్రధాన కార్యదర్శి నూనె మల్లికార్జున యాదవ్ కోరారు. 12వతేది నెల్లూరు తెలుగుదేశంపార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. రాబోయే అసెంబ్లీ ఎన్నికల్లో పార్టీ వంద మంది బిసిలకు టిక్కెట్లు ఇస్తామని ప్రకటించడం మామూలు విషయం కాదన్నారు. స్థానిక సంస్థల్లో ప్రస్తుతం బిసిలకు వున్న రిజర్వేషన్ల 50శాతం పెంచాలని, కేంద్రంలో కూడా బిసిలకు 33.3 శాతం నుంచి 50 శాతానికి రిజర్వేషన్లు పెంచాలని పార్టీ తీర్మానం చేసిన విషయం జ్ఞప్తికి తెచ్చారు. చట్టసభల్లోనూ బిసి మహిళలకు 33శాతం రిజర్వేషన్, అన్ని యూనివర్సిటీ, పాలక మండళ్లు, ప్రభుత్వరంగ కార్పొరేషన్‌లలో 33శాతం రిజర్వేషన్లు కల్పించాలని తెలుగుదేశం పార్టీ తీర్మానించడం బిసిలు మరచిపోలేని విషయమని పేర్కొన్నారు. ఈ తీర్మానాలు చేసినందుకు బిసిలందరూ నారా చంద్రబాబు నాయుడిని అభినందించాలన్నారు. తెలుగుదేశంపార్టీ బిసి సెల్ జిల్లా అధ్యక్షుడు అన్నం దయాకర్ గౌడ్ మాట్లాడుతూ బిసిల్లో అత్యంత వెనుకబడిన కులాలైన వాల్మీకి, వడ్డెర, రజక, నాయి బ్రాహ్మణ, మత్స్యకారుల కులాలను ఎస్సీల్లో కలపాలని తెలుగుదేశంపార్టీ తీర్మానం చేయడం హర్షణీయమన్నారు. సమావేశంలో సురేంద్ర, పడవల కృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

## కెమిస్ట్ అండ్ డ్రగ్గిస్ట్ అసోసియేషన్

**యువ నాయకత్వం బాధ్యతలు స్వీకరణ**



అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నికైన డి.అశోక్‌కుమార్, ఎస్.వెంకటేశ్వర్లను సన్మానిస్తున్న దృశ్యం.

ది నెల్లూరు డిస్ట్రిక్ హోల్‌సేల్ కెమిస్ట్ అండ్ డ్రగ్గిస్ట్ అసోసియేషన్ నూతన కార్యవర్గం ప్రమాణ స్వీకారోత్సవం 12వతేది ఎసి సెంటర్‌లోని గుండా ఆంజనేయులు కళ్యాణ మండపంలో జరిగింది. అధ్యక్షునిగా ఆర్ఆర్ ఫార్మా డిస్ట్రిబ్యూటర్స్ అధినేత డి.అశోక్‌కుమార్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ మెడికల్ ఏజెన్సీస్ అధినేత ఎస్. వెంకటేశ్వర్లు, కోశాధికారిగా శ్రీనివాస మెడికల్ సిండికేట్ అధినేత డి. సుదర్శనరావు ప్రమాణ స్వీకారం చేశారు. ఈ కార్యక్రమంలో జిల్లావ్యాప్తంగా వున్న మెడికల్ డిస్ట్రిబ్యూటర్లు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.

## నడిరోడ్డుపై మద్యంషాపు!

**రెచ్చిపోతున్న మందుబాబులు**




స్వాగత్ లాడ్జి చివర నడిరోడ్డుపై వెలసిన బ్రాందీషాపు.

పోలీసుల నిర్లక్ష్యం, ఎక్సైజ్‌శాఖ వుదాసీనత కారణంగా మద్యం విక్రయాలు ఇష్టానుసారంగా జరుగుతున్నాయి. నిబంధనలు కఠినతరంగా వున్నా వాటిని అమలు చేసేందుకు పైరెండు శాఖలకు చెందిన అధికారులు ప్రయత్నించడం లేదు. నాల్గవ పట్టణ పోలీసు స్టేషన్‌కు కూతవేటు దూరంలో స్వాగత్ లాడ్జి ప్రక్కన గతవారంలో కొత్తగా బ్రాందీషాపు ప్రారంభమైంది. ఈ షాపు ఏర్పాటు చేయబడిన రోడ్డుపై నిత్యం ఎ.సి. కూరగాయల మార్కెట్‌కు రాకపోకలు సాగుతుంటాయి. ఉదయం 4గంటల నుంచి రాత్రి 10గంటల వరకు రోడ్డుకు ఇరువైపుల కూరగాయలు, ఆకు కూరల వ్యాపారులు అంగళ్లు ఏర్పాటు చేసుకొని విక్రయాలు జరుపుతుంటారు. ఈ మార్గంలో షాపుకు ఎక్సైజ్ శాఖ ఎలా పర్మిషన్ ఇచ్చిందో తెలియదు కాని రోడ్డుపైన మద్యం సేవిస్తున్నారు. తాగిన మైకంలో మార్కెట్‌కు వెళ్లే మహిళలను కామెంట్ చేస్తున్నారు. ఎక్సైజ్ నిబంధనల ప్రకారం బ్రాందీషాపుల్లో విక్రయాలు జరపాలి తప్ప, అక్కడే సేవించకూడదు. అయితే బ్రాందీషాపు నిర్వాహకులు తమ వ్యాపారాన్ని మరింత పెంచుకునేందుకు షాపు బయట మద్యం సేవించేందుకు అంగీకరిస్తున్నారు. మద్యపానం చేసేవారి ఆగడాలు శృతిమించక ముందే నియంత్రించాల్సిన అవసరం వుంది.




పెట్రోల్ బంకును ప్రారంభిస్తున్న రాష్ట్ర టౌన్ అండ్ కంట్రీ ప్లానింగ్ డైరక్టర్ పురుషోత్తమరెడ్డి.

## కార్పొరేషన్‌కు స్వంత పెట్రోల్ బంకు!

**దక్షిణ భారతదేశంలో మొట్ట మొదటిది.**

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ కమిషనర్ అధికారపార్టీకి వత్తాసు పలుకుతూ పనిచేస్తున్నా అప్పుడప్పుడు కొన్ని మంచి పనులు కూడా చేస్తుంటాడు. ఈ కోవలోనిదే కార్పొరేషన్ యాజమాన్యాన స్వంతంగా పెట్రోల్ బంకు ఏర్పాటు చేయడం. పాత మునిసిపల్ ఆఫీసుకు సమీపంలోని కలరాషెడ్డు ప్రాంతంలో పెట్టిన ఈ బంకును రాష్ట్ర టౌన్ అండ్ కంట్రీ ప్లానింగ్ డైరక్టర్ పురుషోత్తమరెడ్డి 12వతేది ప్రారంభించారు. ఇక్కడే ఏర్పాటు చేసిన సర్వీసు సెంటర్‌ను ఒక వాహనాన్ని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి శుభ్రం చేసి మరీ ప్రారంభించారు. ఈ సందర్భంగా నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలోనే ఈ సౌకర్యాలు ఏర్పాటు చేసుకొన్న మొట్టమొదటి కార్పొరేషన్ నెల్లూరు అన్నారు. కార్పొరేషన్‌కు వందకుపైగా వాహనాలు వున్నాయని, ఇవి అన్ని ప్రాంతాల్లోని చెత్తను తొలగించను ఇక నుంచి ఇక్కడి నుండే వెళ్తాయన్నారు. డ్రైవర్లకు పెట్రోల్ బంకు ఇక్కడ ఏర్పాటు చేయడం వల్ల సమయం కూడా కలిసివస్తుందన్నారు. ఈ కార్యక్రమంలో మునిసిపల్ కమిషనర్ డాక్టర్ టిఎస్ఆర్ ఆంజనేయులు ఇతర అధికారులు పాల్గొన్నారు.




## వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలు!

**ఆగష్టు 18 నుంచి 24వ తేది వరకు జరుగుతాయి.**

గొలగమూడి వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలలో భక్తులకు అవసరమైన ఏర్పాట్లు చేసి ఎలాంటి సమస్య లేకుండా సమర్థవంతంగా విజయవంతం చేయాలని నెల్లూరు ఆర్డీఓ మాధవీలత పేర్కొన్నారు. 12వ తేది వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలను పురస్కరించుకొని వివిధ శాఖాధికారులతో సమీక్షా సమావేశం ఏర్పాటు చేశారు. ఆగస్టు 18 నుంచి 24 తేదీ వరకు వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలు జరుగుతాయన్నారు. ఎక్కువ మంది భక్తులు వచ్చే అవకాశమున్నందున వారికి అవసరమైన ఏర్పాట్లు చేయాలన్నారు. ఆర్టీసి వీలైనంత ఎక్కువగా బస్సులు నడపాలన్నారు. మంచినీటి సమస్య ఏర్పడకుండా చూసుకోవాలని, పారిశుద్ధ్య కార్యక్రమాలు సమర్థవంతంగా నిర్వహించాలన్నారు. మంచినీటి సౌకర్యం ఏర్పాటులో ఆర్‌డబ్ల్యుఎస్ ఇంజనీరింగ్ అధికారులు సమన్వయంతో సమీక్షించుకొని అవసరమైన పనులు చేపట్టాలన్నారు. రెవెన్యూ అధికారులు, పోలీసు అధికారుల సమన్వయంతో ఆక్రమణలు తొలగించి రవాణా సౌకర్యం మెరుగుపరచాలన్నారు. ఆటోడ్రైవర్లతో సమావేశం ఏర్పాటుచేసి దేవాలయ ఆవరణలోనికి రానీయకుండా సమీప ప్రాంతాలలో నిలిపేలా చూడాలన్నారు. సమావేశంలో రూరల్ డిఎస్పీ బాలవెంకటేశ్వరరావు, ఆర్టీసి డిపో మేనేజర్ షమీమ్, వెంకటాచలం తహశీల్దార్ జనార్ధనరావు, ఎండిఓ సుధాకర్, మెడికల్ అండ్ హెల్త్ క్లస్టర్ అధికారి డాక్టర్ పురుషోత్తమరావు, మెడికల్ ఆఫీసర్ ఉమామహేశ్వరి తదితరులు పాల్గొన్నారు.

● బిట్రగుంటలో

## రౌడీల విజృంభణ!

బిట్రగుంటలో రౌడీమూకల బెడద అధికమయ్యింది. రౌడీయిజాన్ని వృత్తిగా చేసుకొన్న కొందరు బజారులో నిత్యం అల్లరి చేయడం, బెదరించి భయభ్రాంతులకు గురి చేస్తుండడంతో ఈ ప్రాంత ప్రజలు హడలిపోతున్నారు. తమ అనుచరులను వెంటేసుకొని రౌడీ మూకలు తిరుగుతున్నా, గలబాలు సృష్టిస్తున్నా, దాడులకు పాల్పడుతున్నా పోలీస్ అధికారులు పట్టించుకోకపోవడంతో వీరిది ఇష్టారాజ్యం అయ్యింది. అంతేకాకుండా కొందరు పోలీసులు వీరితో లాలూచి పడడంతో ఈ రౌడీల చేతుల్లో దెబ్బలుతింటున్న బాధితులకు న్యాయం

### చోద్యం చూస్తున్న పోలీసులు

జరగడం లేదనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. న్యాయం కోసం పోలీస్‌స్టేషన్‌ను ఆశ్రయిస్తే వారి సమక్షంలోనే రౌడీలకు పోలీస్ స్టేషన్‌లో తగిన మర్యాదలు చేస్తుండడంతో బాధితులు తట్టుకోలేక పోతున్నారు. దీనికి కారణం కొందరు పోలీసులకు, రౌడీలకు మధ్య వున్న సంబంధాలే. వారికి కావలసిన సహాయసహకారాన్ని అల్లరి మూకలు అందజేస్తుండడంతో రౌడీలపై చర్యలు చేపట్టకుండా వుంటున్నారనే ఆరోపణలు వినవస్తున్నాయి. ఇప్పటికైనా రౌడీమూకలను అణచివేయకపోతే పోలీస్ వ్యవస్థ మీదే నమ్మకం పోతుందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు.

## పక్కా గృహాల నిర్మాణం పూర్తి చేయండి!

### గృహ నిర్మాణ శాఖ ఇఇ ఆదేశం

నిర్ణీత లక్ష్యానికి అనుగుణంగా పక్కా గృహాలను నిర్మించాలని గృహ నిర్మాణశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ సాయిరాం నాయుడు అధికారులను ఆదేశించారు. వెంకటగిరి సబ్ డివిజన్ కార్యాలయంలో గృహ నిర్మాణాలపై ఆయన అధికారులతో సమీక్ష నిర్వహించారు. వెంకటగిరి మునిసిపల్ పరిధితోపాటు వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి మండలాల్లో గృహనిర్మాణాలు అసంపూర్తిగా వున్నాయన్నారు. వీటిని త్వరితగతిన పూర్తి చేయాలన్నారు. కొత్తగా వచ్చిన దరఖాస్తులకు సంబంధించి మంజూరుకై తగిన ఆదేశాలు వచ్చాకే నిర్మాణాలు మొదలు పెడతామని తెలిపారు. ఈ సమావేశంలో డిఇ నరసింహులు, ఎఇలు పాల్గొన్నారు.



పద్మావతి కళ్యాణ మండపంలో జరిగిన నెల్లూరు రోటరీ క్లబ్ నూతన కార్యవర్గం బాధ్యతల స్వీకరణ కార్యక్రమంలో రొటేరియన్ దొడ్ల భరత్‌కుమార్‌రెడ్డి చేతులమీదుగా జోన్ వన్ అసిస్టెంట్ గవర్నర్‌గా బాధ్యతలు స్వీకరిస్తున్న నేతాజి పైలెట్ స్కూల్ అధినేత సుబ్బారెడ్డి.

## చదువిలానే చెబుతారా?

● నావూరులో ఉపాధ్యాయులను నిలదీసిన కలెక్టర్

మాతృభాష అయిన తెలుగును సరిగా చదవలేకపోవడం, జాతీయ భాష అయిన హిందీని సక్రమంగా పలకలేకపోతున్న విద్యార్థులను చూసిన జిల్లా కలెక్టర్ శ్రీధర్ ఉపాధ్యాయ సిబ్బందిపై ఆగ్రహం వ్యక్తం చేశారు. కలెక్టర్‌కు వివిధ పాఠశాలలను తనిఖీ చేసినపుడు అక్కడి విద్యార్థులతో ముచ్చటించడం, వారి పఠనాశక్తిని పరీక్షించడం అలవాటు. ఇటీవల ఆయన పొదలకూరు మండలం నావూరు హైస్కూలును తనిఖీ చేశారు. ఈ సందర్భంగా తొమ్మిదవ తరగతి చదువుతున్న బాలికలను పిలిచి తెలుగుపాఠం చదవమనగా చదవలేక పోయారు. అలాగే, పదవతరగతి విద్యార్థులు సైతం హిందీలో మొదటి పాఠం చదవలేకపోవడం, కనీసం తమ పేరును హిందీలో వ్రాయలేకపోవడాన్ని చూసిన కలెక్టర్ అక్కడ వున్న ఉపాధ్యాయులపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. సొంత వ్యాపారాలు చక్కబెట్టుకోవడం కాదు పిల్లలకు చదువు చెప్పడంలో శ్రద్ధ పెట్టండి అని చురకలంటించారు.

## పనిచేయించుకున్నారు... డబ్బులివ్వలేదు!

మంచి ఆదాయం వస్తుందని ఎన్నికల సమయంలో పనిచేసిన ఫోటోగ్రాఫర్లు తమకు రావాల్సిన మొత్తాల కోసం కాళ్లరిగేలా తిరగాల్సిన పరిస్థితి ఏర్పడింది కావలిలో. ఇటీవల జరిగిన ఉప ఎన్నికల సందర్భంగా వివిధ ప్రైవేట్ ఫోటోగ్రాఫర్లను వినియోగించుకొన్నారు అధికారులు. అభ్యర్థుల ప్రచారం, ఇతరత్రా కార్యక్రమాలను వీరి ద్వారా ఫోటోలు, వీడియోలు చిత్రీకరణ జరిపారు. కానీ వారికివ్వాల్సిన మొత్తాలను ఇంతవరకు ఇవ్వకపోవడంతో వారంతా అధికారుల చుట్టూ తిరగాల్సి వస్తోంది. వీరంతా ప్రైవేట్ ఫోటోగ్రాఫర్ల సంఘం తరపున ఆర్‌డిఓను కలసి తమగోడు వెళ్లబోసుకొన్నారు. ఎన్నికలలో విధులు నిర్వహించిన అధికారులు బదలీ కావడం వారి స్థానాల్లో కొత్తవాళ్లు వచ్చి చేరడంతో తమ గురించి పట్టించుకోవడం లేదని వాపోయారు. దీనిపై స్పందించిన ఆర్‌డిఓ పది రోజుల్లో ఆయా మొత్తాలను చెల్లిస్తామని హామీ ఇచ్చారు.

## ముత్తుకూరు సభతో సత్తాచాటిన మెట్టా విష్ణు!

### వైకాపా బహిరంగ సభకు పెద్ద సంఖ్యలో జనం

ముత్తుకూరు మండల వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ యువనేత మెట్టా విష్ణువర్ధన్‌రెడ్డి ఆధ్వర్యంలో జులై 15న స్థానికంగా నిర్వహించిన బహిరంగసభకు జనం భారీగా తరలివచ్చారు. పార్టీలో చేరిన నాటి నుంచి వైకాపాను ప్రజల ముందుకు తీసుకొనిపోవడంలో విష్ణు ఎంత శ్రమపడుతున్నాడో మండలం నలుమూలల నుంచి తరలి వచ్చిన జనసందోహాన్ని చూస్తే అర్థమవుతుంది. ఆ పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డికి విష్ణువర్ధన్‌రెడ్డి, స్టీరింగ్



బహిరంగ సభలో మాట్లాడుతున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

కమిటీసభ్యుడు పేర్నేటి శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి ఘనస్వాగతం పలికారు. కార్యకర్తలు మోటారు సైకిళ్లపై జరిపిన ర్యాలీ ఆకట్టుకొంది. సభనుద్దేశించి కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలో దుర్మార్గపాలన నడుస్తోందన్నారు. వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి పేద ప్రజల కోసం ఎన్నో సంక్షేమ పథకాలను చేపడితే, నేటి పాలకులు వాటిని తుంగలోతొక్కారని విమర్శించారు. రైతులకు రెండు గంటలపాటు కూడా విద్యుత్ ఇవ్వలేకపోతున్నారని దుయ్యబట్టారు. రాజన్న రాజ్యం వైఎస్ జగన్‌కే సాధ్యమన్నారు. అధికారపార్టీ నేతలు నియోజకవర్గంలో తమ పార్టీ కార్యకర్తలను ఇబ్బంది పెడితే సహించేది లేదన్నారు. యువనేత మెట్టా విష్ణువర్ధన్‌రెడ్డి చేరిక వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీకి మండలంలో అదనపు బలాన్ని ఇచ్చిందన్నారు. అన్ని గ్రామాల నుంచి తరలి వచ్చిన కార్యకర్తలతో సభాప్రాంగణం కిక్కిరిసిపోయింది.

## విద్యుత్ చౌర్యం చేసిన ఎఇ మామ!

తన అల్లుడు ఎలక్ట్రిసిటి ఎఇ అని, తానేం చేసిన ఎవరూ అడగలేరనే ధైర్యం, తలపొగరుతో కరెంటు వినియోగంలో అక్రమాలకు పాల్పడిన ఒక మామగారి నిర్వాకం ఇది. కావలి పట్టణంలో ఒక ఇంట్లో మీటరు తిరగనీయకుండా చేసి విద్యుత్ చౌర్యం చేస్తున్న సంగతి పసిగట్టిన ఎఇ శ్రీకాంత్ ఆ ఇంటికి తనిఖీకి వెళ్లగా అసలు విషయం బయట పడింది. కావలి డివిజన్‌లోనే ఎఇగా పనిచేసే వ్యక్తి మామ ఈ దుర్వినియోగానికి పాల్పడడం కలకలం లేపింది. నాలుగు ఎసిలు వున్నప్పటికీ ఈయన గారికి వచ్చే బిల్లు మాత్రం కేవలం 150 రూపాయలట. అనుమానం వచ్చి ఎఇ తనిఖీ చేసి మీటరు తిరగనీయకుండా రేకుపెట్టి వుండడాన్ని ప్రశ్నించారు. దీంతో కోపం వచ్చిన ఆయన మా అల్లుడు ఎఇనే మీరేం చేస్తారో చేసుకోండి అని దుర్భాషలాడాడట. ఈ విషయాన్ని తనిఖీకి వెళ్లిన ఎఇ శ్రీకాంత్ విజిలెన్స్ అధికారులకు సమాచారం ఇవ్వడంతో వారు వచ్చి రూ.4.80లక్షలు జరిమానా విధించారు. తన పలుకుబడి ప్రయోగించి 15వేల రూపాయలు మాత్రమే కట్టాడట. డిపార్టుమెంటు వాళ్లకు ఒక న్యాయం, సామాన్యులకు మరో న్యాయమా ఎస్ఇగారూ...



బోగోలు విశ్వనాధరావుపేటలోని ఖాదర్ వలీ దర్గాలో గంధమహోత్సవం సందర్భంగా దర్గా కమిటీ సభ్యులు సిరాజ్, సమీవుల్లా, అహ్మద్‌బాష తదితరులు.

# బోగోలు మహిళ ఘనత!

## ఐఎన్‌టియుసి రాష్ట్ర కార్యవర్గంలో చోటు

ఐఎన్‌టియుసి రాష్ట్ర మహిళా ఉపాధ్యక్షురాలి పదవికి బోగోలుకు చెందిన మెతుకు రాజేశ్వరి ఎంపికయ్యారు. ఈ మేరకు ఆ విభాగం రాష్ట్ర అధ్యక్షురాలు జి.రాజేశ్వరి నియామకపు ఉత్తర్వులు అందజేసింది. ఈ సందర్భంగా బోగోలు కాంగ్రెస్ పార్టీ కార్యాలయంలో జరిగిన సమావేశంలో మెతుకు రాజశ్వేరి మాట్లాడుతూ తనపై ఎంతో నమ్మకం వుంచి పెద్ద బాధ్యత అప్పగించినందుకు, రాష్ట్ర అధ్యక్షురాలికి, పదవి వచ్చేందుకు కృషి చేసిన మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డికి కృతజ్ఞతలు తెలిపారు. కార్మికుల సమస్యలు, మహిళల సమస్యలు పరిష్కరించేందుకు తనవంతు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. బోగోలు మండల



కాంగ్రెస్ కన్వీనర్ కర్రెద్దుల రమేష్, మాజీ ఎంపిటిసి కామేశ్వర రావు, ఆదర్శరైతు సోము, వెంకటపతి, శీనయ్య తదితరులు విచ్చేసి రాజేశ్వరిని అభినందించారు.

● ఎవరికీ పట్టని

# జంగాల కాలనీ పాఠశాల!



అధికారుల నిర్లక్ష్యం, ప్రజాప్రతినిధుల కక్షసాధింపు ఫలితంగా విజ్ఞానాన్ని పెంపొందించుకోవాల్సిన విద్యార్థులు పాఠశాల వదిలిపెట్టిపోవాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి అనంతసాగరం మండలం మంచాలపల్లి గ్రామంలో. ఇక్కడ రెండు స్కూళ్లు వుండగా అత్యధికంగా విద్యార్థులుండే పాఠశాలలో ఉపాధ్యాయుల కొరత కారణంగా చదువుకు ఆటంకం ఏర్పడుతుండడంతో ఆ పాఠశాల వదిలి వెళ్తున్నారు విద్యార్థులు. దీనిపై అధికారులను కొన్నేళ్లుగా టీచర్ల కొరత తీర్చమని గ్రామస్తులు కోరుతున్నా స్పందన లేదు. మరోవైపు ప్రజాప్రతినిధులు తమ పార్టీకి ఓటు వేయలేదని కక్ష సాధింపులకు పాల్పడుతుండడంతో విద్యార్థులు నలిగిపోతున్నారు. మంచాలపల్లి మెయిన్‌స్కూలు, జంగాల కాలనీలో ప్రాథమికోన్నత పాఠశాల వున్నాయి. మెయిన్ స్కూలు కంటే వసతుల పరంగా, తరగతి గదులు, కంప్యూటర్ పరికరాలు, మంచినీటి సౌకర్యం తదితర అన్ని సౌకర్యాలు వున్నాయి. ప్రాథమిక పాఠశాలగా వున్న దీనిని నాలుగేళ్ల క్రిందట ప్రాథమికోన్నత పాఠశాలగా అప్‌గ్రేడ్ చేశారు. 7వ తరగతి వరకు వున్న ఇక్కడ దాదాపు 255 మందికి పైగా విద్యార్థులు చదువుకొంటున్నారు. విద్యార్థుల సంఖ్య అధికంగా వున్నా టీచర్లు మాత్రం ముగ్గురే. దీంతో అన్ని తరగతులకు ఈ ముగ్గురు ఉపాధ్యాయులే పాఠ్యాంశాలను బోధించాల్సి రావడంతో సరిగా విద్యాబోధన జరగడం లేదు. గత ఏడాది 8 మంది విద్యావాలంటీర్లను నియమించినా వారు కొద్ది కాలానికే బిఈడి, టెట్ తదితర శిక్షణకు వెళ్లడంతో పరిస్థితి మళ్లీ మొదటికొచ్చింది. వున్న ముగ్గురు టీచర్లలో ఒకరు ఎక్కువగా సెలవులో వుంటుండడం, ఇద్దరు ఉపాధ్యాయుల పైనే భారం అంతా పడుతుండడంతో పాఠశాల అస్తవ్యస్తంగా మారింది. విద్యార్థులు వున్నా చెప్పేందుకు టీచర్ల కొరతతో విధిలేక వారిని సమీపంలోగల ఉప్పలపాడు పాఠశాలకు పంపిస్తున్నారు. జంగాలకాలనీలో ఎక్కువ మంది బడుగు బలహీన వర్గాల పిల్లలే. అలాంటి వారిని ప్రోత్సహించి చదువు చెప్పాల్సిన అధికారులు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తున్నారు. ఇటీవల ఆత్మకూరు నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి దృష్టికి ఈ సమస్య తీసుకొనిపోగా మీరు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి ఓటు వేశారు కదా, ఆ పార్టీ వారినే వెళ్లి అడగండి అని సమాధానం ఇవ్వడం పట్ల ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు స్థానికులు. ఇప్పటికైనా ఈ పాఠశాలకు తగిన టీచర్లను నియమించి విద్యార్థుల వలసబాటను అరికట్టాల్సి వుంది.

# గూడూరు ట్రాఫిక్ పద్మవ్యూహం!

రోజురోజుకు అధికం అవుతున్న వాహనాలు, కుంచించుకుపోతున్న రోడ్లు, పెరుగుతున్న జనాభా మూలంగా గూడూరు పట్టణంలో ట్రాఫిక్ సమస్య తీవ్రతరం అవుతోంది. విద్యార్థులు, ఉద్యోగులు, వ్యాపారులు తమ పనులపై వెళ్లాలంటే ట్రాఫిక్ పద్మవ్యూహంలో చిక్కుకొని విలవిల్లాడుతున్నారు. ఎక్కడ చూసినా గంటల తరబడి వాహనాలు నిలిచి పోతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ముఖ్యంగా ఒకటి, రెండవపట్టణ పరిధిలో వాహనాలపై ప్రయాణించేవాళ్లు నరకాన్ని చవిచూడాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ రెండు ప్రాంతాల మధ్య వున్న రైల్వే అండర్ బ్రిడ్జి వద్ద తరచూ ట్రాఫిక్ సమస్య తలెత్తుతూ వుంది. ఇక్కడ ట్రాఫిక్ సిగ్నల్స్‌ను ఏర్పాటు చేసినప్పటికీ అవి పనిచేయక దిష్టిబొమ్మల్లా మారాయి. రైల్వేగేటు మీదుగా వెళ్లాలనుకొనే వారు ఆ వైపుగా ప్రయాణిస్తున్న వారికి తిప్పలు తప్పడం లేదు. గేటు ఎప్పుడు వేస్తారో ఎప్పుడు తీస్తారో తెలియని పరిస్థితుల్లో గంటల తరబడి వేచి వుండాల్సి వస్తోందని పట్టణ ప్రజలు వాపోతున్నారు. అలాగే టవర్ క్లాక్ సెంటర్,

### ఛేదించేవారెవరు?

మార్కెట్ సెంటర్, సంగం థియేటర్, ఆర్‌టిసి బస్టాండు తదితర ప్రాంతాలలో నిత్యం ట్రాఫిక్ సమస్యలు ఎదురౌతూనే వున్నాయి. రోడ్లు ఆక్రమణకు గురౌతుండడం వాహనాలు పెరగడం, ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేవారు లేకపోవడంతో గూడూరు పట్టణం అస్తవ్యస్తంగా మారింది.

● వెంకటగిరి ఆరోగ్య ఉపకేంద్రాలకు

# జబ్బు చేసింది!

### చికిత్స చేసేదెవరు?

గ్రామీణ ప్రాంత ప్రజలకు వైద్య సదుపాయాలు అందించాలన్న ఉద్దేశంతో ఏర్పాటుచేసిన ఆరోగ్య ఉప కేంద్రాలు అలంకారప్రాయంగా మారుతున్నాయి. వైద్య సిబ్బంది లేక, వున్నవారు సక్రమంగా విధులు నిర్వహించక, తగిన భవనాలు లేక ఉప కేంద్రాలు నామమాత్రంగా మిగులుతున్నాయి అనేందుకు వెంకటగిరి నియోజకవర్గం ఉదాహరణ. ఇక్కడ వుండే ఆరోగ్య ఉప కేంద్రాలు ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడటం లేదు. నియోజకవర్గ కేంద్రమైన వెంకటగిరి మండలంలో 11 ఆరోగ్య ఉప కేంద్రాలు పని చేస్తున్నాయి. డక్కిలి మండలంలో 9, బాలాయపల్లి మండలంలో 9, రాపూరు మండలంలో 11 ఆరోగ్య ఉప కేంద్రాలు వున్నాయి. ఇన్ని కేంద్రాలున్నా అవి సరిగా ప్రజలకు ఉపయోగపడకుండా పోతున్నాయి. వీటిలో చాలా వాటికి భవనాలు లేవు. ఆరోగ్య ఉప కేంద్రాల నిర్వహణకు వేలాది రూపాయల నిధులు మంజూరవుతున్నా ప్రాథమిక చికిత్సకు అవసరమైన మందులు అందుబాటులో వుండడం లేదు. ఇక వైద్య సిబ్బంది ఎప్పుడు వస్తారో, ఎప్పుడు వెళ్తారో తెలియడం లేదని ఈ కేంద్రాలకు వైద్య సహాయం కోసం వచ్చే వారు వాపోతున్నారు. ఈ సమస్యలను పరిష్కరించేవారు, వైద్య సేవలను పర్యవేక్షించేవారు లేకపోవడంతో ఆరోగ్య ఉప కేంద్రాలు ప్రజలకు ఉపయోగపడకుండాపోతున్నాయి.

# విద్యతోనే అభివృద్ధి!

## చెంచుగానిపాళెంలో ఎమ్మెల్యే మస్తాన్‌రావు

విద్యతోనే సమాజాభివృద్ధి జరుగుతుందని, బాలికలు విద్యావంతులైతే దేశమే అభివృద్ధి చెందుతుందని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు తెలిపారు. ఆడపిల్లలు బాగా చదువుకోవాలని అందుకోసం తన సొంత నిధులను వెచ్చిస్తానని హామీ ఇచ్చారు. కావలి రూరల్ మండలం చెంచుగానిపాళెంలో గల ప్రాథమికోన్నత పాఠశాలలో నిర్మించిన అదనపు తరగతి గదులను ఆయన ప్రారంభించారు. గతంలో ఈ పాఠశాలను సందర్శించినపుడు విద్యార్థులకు తరగతి గదుల అవసరాన్ని గుర్తించామని, రాజీవ్ విద్యామిషన్ ద్వారా లక్షా 60వేల రూపాయలు మంజూరు చేయించి అదనపు గదులను నిర్మించడం జరిగిందన్నారు. బాగా చదువుకొని ఉన్నత శిఖరాలను అధిరోహించాలని విద్యార్థులకు హితబోధ చేశారు. బిఎంఆర్ ట్రస్టు ద్వారా ప్రహరీ గోడను నిర్మించడంతోపాటు ఫ్యాన్లు ఇతరత్రా పనులు చేయిస్తానన్నారు. విద్యార్థులు చదువుతోపాటు ఆటల్లోను ప్రతిభ కనపరచాలన్నారు. ఈ సందర్భంగా పిల్లలకు చాక్లెట్లు, బిస్కెట్లు పంచిపెట్టారు. ఈ కార్యక్రమంలో కావలి ఎమ్మార్వో వెంకటేశ్వర్లు, ఎంపిడిఓ వసుంధర, ఎంఇఓ సత్యనారాయణ, నాయుడు రాంప్రసాద్, బ్రహ్మయ్య, మురళి, సిద్ధిఖ్ తదితరులు పాల్గొన్నారు.

# జడ్పీ సిఇఓ ఆకస్మిక తనిఖీలు!

## మనుబోలు, చిల్లకూరు, నాయుడుపేట ఎమ్పీడిఓ కార్యాలయాల సందర్శన

ఎన్నిసార్లు చెప్పినా ప్రత్యేకాధికారులు వారి పని తీరు మార్చుకోవడం లేదని జిల్లా పరిషత్ సిఇఓ వీర భద్రయ్య అసంతృప్తి వ్యక్తం చేశారు. ఇటీవల ఆయన మనుబోలు, చిల్లకూరు, నాయుడుపేట మండలాల్లో ఆకస్మిక తనిఖీలు నిర్వహించారు. ముందుగా మనుబోలు మండల కార్యాలయానికి వెళ్లిన ఆయన అక్కడి రికార్డులను పరిశీలించి ఎంపిడిఓ సుగుణమ్మ పనితీరును మెచ్చుకొన్నారు. పదవ తరగతిలో మండల విద్యార్థులు 9.8 గ్రేడ్ సాధించడాన్ని అభినందించారు. అనంతరం చిల్లకూరు ఎంపిడిఓ కార్యాలయాన్ని తనిఖీ చేశారు. జాబ్ కార్డులను పరిశీలించిన ఆయన 120రోజుల పని కల్పించాలని సిబ్బందికి సూచించారు. త్రాగునీటి సమస్య పరిష్కారానికి ప్రాధాన్యత నివ్వాలన్నారు. నాయుడుపేట ఒకటో నెంబర్ వసతి గృహాన్ని పరిశీలించిన సిఇఓ అక్కడ ఆహారం నిల్వ వుండడాన్ని చూసి ఎందుకు వుంచారని హాస్టల్ సిబ్బందిని ప్రశ్నించారు. అలాగే విద్యార్థులకు యూనిఫారాలు, జామెట్రీ బాక్సులు ఇవ్వకపోవడంపైనా అసంతృప్తి వ్యక్తం చేశారు. మొత్తం మీద జడ్పీ సిఇఓ చేసిన ఆకస్మిక తనిఖీలు వివిధ మండలాల సిబ్బందిలో హడలు పుట్టించాయి.



వెంకటగిరి వైకాపా నేత మోహన్ ఆధ్వర్యంలో నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డిని సన్మానిస్తున్న నేతలు.

# మరీ ఇంత బరితెగింపా?

**● కావలిలో మద్యం వ్యాపారాన్ని పరిశీలించిన బీద**

నిబంధనలు అతిక్రమించి నిర్వహించే బ్రాందీషాపుల యాజమాన్యాలపై చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు. కావలి పట్టణంలో వివిధ ప్రాంతాల్లో ఏర్పాటు చేసిన మద్యం షాపులను ఆయన పరిశీలించారు.పెద్దపవని బస్టాండు వద్ద గల శ్రీపొట్టిశ్రీరాముల విగ్రహం వద్ద వున్న బ్రాందీషాపు పరిసర ప్రాంతాల్లో కలియ తిరిగిన ఆయన మాట్లాడుతూ ఆఫర్ల పేరుతో ప్రజలను ఆకట్టుకొని వారితో మద్యం తాగించడాన్ని తీవ్రంగా ఖండించారు. ఒకటి కొంటే మరొకటి ఫ్రీ అన్న చందంగా మద్యం కొంటే ఫుడ్ ఫ్రీ అని ఆఫర్లు ఇస్తూ ప్రజలతో మద్యం తాగించి తద్వారా అమ్మకాలు పెంచుకోవడం సిగ్గు చేటన్నారు. పలు ప్రాంతాల్లో మద్యం బాటిళ్లు, వ్యర్థాలు కాలువల్లో, చుట్టు ప్రక్కల పడి వుండడాన్ని గమనించిన ఎమ్మెల్యే అక్కడి నుంచే ఎక్సైజ్ అధికారులతో ఫోన్‌లో మాట్లాడారు. నిబంధనలు అతిక్రమించి నిర్వహిస్తున్న మద్యం షాపులపై ఏమి చర్యలు తీసుకుంటున్నారని వారిని ప్రశ్నించారు. అలాంటి వారి పట్ల కఠినంగా వ్యవహరించాలన్నారు. పట్టణంలో పారిశుధ్య పరిరక్షణ మునిసిపాలిటీతోపాటు ప్రతి ఒక్కరి బాధ్యతన్నారు. ఎమ్మెల్యే వెంట తెలుగు దేశం పార్టీ నాయకులు పూనూరు రవి కుమార్‌రెడ్డి, రామారావు, బ్రహ్మయ్య, అలీఖాన్ తదితరులు పాల్గొన్నారు.

# ఇందిరమ్మ ఇళ్లకోసం నిరసన దీక్షలు!

## వెంకటగిరి ప్రజల ఓపిక నశించింది.

వెంకటగిరి మునిసిపాలిటీ పరిధిలో మూడవ విడత ఇందిరమ్మ ఇళ్లకు సంబంధించి నివేశన స్థలాల కోసం పేదలు ఎదురు చూడాల్సి వస్తోంది. ఏళ్ల తరబడి స్థలాలు చూపక పోవడంతో లబ్దిదారులు స్థానిక తహశీల్దార్ కార్యాలయం ఎదుట దీక్షలు చేపట్టారు. పేదలు ఇంటి స్థలాల కోసం నిరసన దీక్షలకు దిగిన సమాచారాన్ని అందుకొన్న స్థానిక శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ దీక్ష శిబిరాన్ని సందర్శించి లబ్దిదారులతో మాట్లాడారు. గత నాలుగేళ్లుగా మూడవ విడత ఇందిరమ్మ ఇళ్ల పట్టాలు ఇంతవరకు పంపిణీ చేయక పోవడంపై వారు ఆగ్రహించారు. దీనిపై సబ్‌కలెక్టర్‌తో మాట్లాడి పరిష్కరిస్తానని హామీ ఇచ్చిన ఎమ్మెల్యే అక్కడి నుంచే ఫోన్‌లో ఆయనతో మాట్లాడారు. త్వరితగతిన పట్టాలు పంపిణీ చేయిస్తామని, సర్వే చేయించి ప్లాట్లు కేటాయిస్తామని హామీ ఇచ్చారు. దీంతోలబ్దిదారులు దీక్ష విరమించారు. మాజీ కౌన్సిలర్ జానకిరామయ్య ఆధ్వర్యంలో జరిగిన ఈ నిరసన దీక్షలో 800 మంది లబ్దిదారులు పాల్గొన్నారు.

# 46మందిపై చీటింగ్ కేసు!

## డివిసత్రం సిండికేటు బ్యాంకును మోసం చేశారు

దొరవారిసత్రం మండలంలో గల సిండికేటు బ్యాంకును మోసం చేసి పంట రుణాలు పొందిన 46 మందిపై చీటింగ్ కేసు నమోదైంది. మండల పరిధిలోని గొల్లపాళెం, సూరపు అగ్రహారం, పోలిరెడ్డిపాళెం గ్రామాలకు చెందిన 46 మంది షుమారు 20లక్షల రూపాయలకు పైగా పంట రుణాలు తీసుకున్నారు. బాకీ చెల్లించకపోవడంతో ఆమొత్తం 40లక్షలకు చేరుకొంది. ఇటీవల రికవరీ కోసం బ్యాంకు అధికారులు వెళ్లగా తప్పుడు పత్రాలతో బ్యాంకును మోసం చేసి రుణం పొందినట్లు తెలియడంతో వీరిపై కేసు నమోదు చేశారు.

# తన తప్పులతోనే తన పతనమని తెలిసేదెప్పుడు?

## తెలుగుదేశంలో పోస్టుమార్టం జరిగేనా?



కోమాలో వున్న రోగి వంటి స్థితిలో వున్న తెలుగుదేశం పార్టీకి మళ్లీ ప్రాణం పోయడానికి చంద్రబాబు తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నాడు. తన విధానాలు, తన సిద్ధాంతాలు, తమ పోకడల వల్లనే పార్టీకి ఈ గతి పట్టిందన్న నిజం ఆయనకు బాగా అర్ధమైంది. 2009 ఎన్నికలలో పార్టీని దాదాపు గెలుపుకు దగ్గరగా తెచ్చిన ఘనత ఆయనదే. కానీ ఆ తర్వాతే చంద్రబాబులో మనోస్థైర్యం లోపించింది. వైఎస్ఆర్ మరణం, ఆ సానుభూతితో జగన్‌కు వెల్లువెత్తిన ప్రజాదరణ ఆయన్ను అయోమయంలో పడవేశాయి. చంద్రబాబు వేసిన తొలి తప్పటడుగు – తెలంగాణ. 2009 ఎన్నికల సమయంలో తాము తెలంగాణకు అనుకూలమని స్పష్టంగా ప్రకటన చేసిన ఆయన, ఎన్నికలు కాగానే వెనుకడుగు వేశాడు. రెండు కళ్ల సిద్ధాంతం ప్రతిపాదించాడు. దానితో తెలంగాణ వాదులలో ఆయన పట్ల నమ్మకం సడలింది. తెలంగాణ ఇచ్చేది, తెచ్చేది తెలుగుదేశం కాకపోయినా, శిక్ష మాత్రం అందరి కంటే అధికంగా ఆ పార్టీకే విధించారు ప్రజలు. అప్పటి నుంచి ఇప్పటి వరకు జరిగిన ప్రతి ఉపఎన్నికలోనూ దారుణంగా ఓడించారు. దాని వల్ల తెలంగాణ ప్రాంతంలో పార్టీకి వున్న బలమైన నాయకత్వాన్నే కాకుండా, పటిష్టమైన కార్యకర్తల వ్యవస్థను కూడా కోల్పోవలసి వచ్చింది.



పార్టీలో వుండే ఒకరిద్దరు ఆంధ్ర నేతల ఒత్తిడికి తలొగ్గి చంద్రబాబు తన నిర్ణయాన్ని మార్చుకొన్నాడన్న అభిప్రాయం వుంది. నిజానికి తెలుగుదేశం పార్టీ తెలంగాణ అనుకూలంగా మారితే ప్రజలలో వచ్చే ఇబ్బంది ఏదీ లేదు. 2009 ఎన్నికలలోనే అది రుజువైంది. టిఆర్ఎస్‌తో పొత్తు పెట్టుకొని, తెలంగాణ అనుకూల ప్రకటనలతో ఎన్నికలకు వెళ్లినా పరిస్థితి మెరుగు పడిందే తప్ప తరుగు కాలేదు. ఓటమికి కారణం తెలంగాణ కాదు. చిరంజీవి ప్రజారాజ్యం, లోక్‌సత్తా పార్టీల వల్ల కల్గిన ఓట్ల చీలిక వల్ల చాలా స్థానాలు కోల్పోయింది తెలుగుదేశం పార్టీ. దానికి తెలంగాణ నిర్ణయానికి ఏ మాత్రం సంబంధం లేదు. అది తెలిసి కూడా ఆ విషయంలో మనసు మార్చుకొని తటస్థ వైఖరి అవలంభించాడు చంద్రబాబు. దాని దుష్ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నాడు.

### ప్రతిపక్ష బాధ్యత విస్మరించాడు!

ఆయన రాజకీయంగా చేసిన రెండవ తప్పు – జగన్ మీద కక్ష పెంచుకోవడం. ఈనాడు రామోజీరావుకు, జగన్‌కు మధ్య నడిచే యుద్ధంలో అనవసరంగా వేలు పెట్టాడు చంద్రబాబు. అది మెల్లమెల్లగా ఇద్దరి మధ్య ఆర్పరాని శత్రుత్వాన్ని పెంచింది. దానితో ప్రతిపక్షం బాధ్యత విస్మరించి, జగన్‌తో కయ్యానికి కాలు దువ్వడంతోనే కాలం గడిపేశాడు. జగన్ అవినీతిని ప్రశ్నించడం రాజకీయంగా ఆయనకొక బాధ్యత అన్నది నిజమే. కానీ అదొక్కటే వ్యాపకంగా మారడంతో కాంగ్రెస్‌కు, తెలుగుదేశం పార్టీకి తేడా లేకుండా పోయింది. జనం నిజమైన ప్రతిపక్షంగా జగన్‌ను చూశారు. ప్రభుత్వం మీద వున్న ద్వేషాన్ని జగన్ మీద ప్రేమగా మార్చుకొన్నారు. పార్టీ ఉనికికే ప్రమాదం తెచ్చి పెట్టింది. కోమాలో వున్న రోగి స్థితికి చేరింది.

### పోరుబాటేది?

1999 ఎన్నికలలో రెండవసారి కాంగ్రెస్ ఓటమి ఎదుర్కొన్నప్పుడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి పోరాట పంథా అవలంభించాడు. ప్రతి ప్రభుత్వ నిర్ణయాన్నీ అడ్డుకొన్నాడు. ప్రజలను సమీకరించాడు. ధర్నాలు, దీక్షలు, ఉద్యమాలతో కార్యకర్తలకు చేతినిండా పని కల్పించాడు. కానీ 2009 తర్వాత చంద్రబాబు, ఆయన పార్టీ నేతలు పార్టీ కార్యాలయాల్లో పత్రికా విలేకరుల సమావేశాలకు మాత్రమే పరిమితమైపోయారు. ప్రజలను తమ పోరాటంలో భాగస్వాములను చేయలేకపోయారు. తమ ఉద్యమాల ద్వారా ప్రభుత్వం అస్థిరత్వం పాలైతే, జగన్‌కు అనుకూలమౌతుందన్న భయం ఆ పార్టీ అస్థిత్వాన్ని ప్రశ్నార్ధకం చేసింది.




### బాబుకు ఇంకా సమయం!

ఈ తప్పులన్నిటినీ సరిదిద్దుకోవడానికి చంద్రబాబుకు ఇంకా సమయం వుంది. సాధారణ ఎన్నికలకు ఒకటిన్నర సంవత్సరాల వ్యవధి వుంది. తనలో మార్పు వస్తే తప్ప పార్టీ బ్రతికి బట్ట కట్టడం జరగని పని అన్న నిజం అర్ధం చేసుకోవడంలో ఇప్పటికే చాలా ఆలస్యం చేశాడాయన. మిగిలిన కొద్ది సమయాన్నైనా సద్వినియోగం చేసుకోవాలంటే, త్వరపడి నిర్ణయాలు తీసుకోవాలి. దాటవేత, సాచివేత వైఖరులను మార్చుకోవాలి. నిజానికి తెలంగాణలో తెలుగుదేశానికి బంగారు వంటి అవకాశం వుంది. ఆ ఉద్యమానికి నేతృత్వం వహిస్తున్న జెఎసి, టిఆర్ఎస్‌ల మధ్య బేధాభిప్రాయాలు పొడసూపాయి. కెసిఆర్‌కు ప్రజలలో విశ్వసనీయత పోయింది. ఆయన మాటలను ఎవరూ నమ్మడం లేదు. జగన్ పూర్తిగా సమైక్యవాది. ఆయన కానీ, ఆయన పార్టీ కానీ తెలంగాణ నినాదాన్ని తలకెత్తుకొనే అవకాశమే లేదు. కాంగ్రెస్‌కు జాతీయ సమస్యలున్నాయి. వారు ఏదీ తేల్చి చెప్పే పరిస్థితిలో లేరు. ఈ సంధి సమయంలో తెలుగుదేశం ఒక అడుగు ముందుకు వేసి, తెలంగాణ ఉద్యమాన్ని తన తలకెత్తుకోగల్గితే, ప్రజలలో నమ్మకం కల్గించగలిగితే, స్పష్టమైన విధానాలతో జనం ముందుకు వెళ్తే, ఆ ప్రాంతంలో పార్టీకి పునరుజ్జీవం వస్తుంది.

### ఆంధ్ర ప్రాంతంలోనే ఇబ్బంది

ఆంధ్ర ప్రాంతంలో పార్టీని బ్రతికించడం అనుకొన్నంత సులువు కాదు. ఒక్క నిర్ణయంతో, ఒక్క ఉద్యమంతో ప్రజలకు చేరువ కావడం అసా

కొరవ 14వ పేజీలో

# కులం తోకతో ఈదుతారట?

## ● కాంగ్రెస్ పార్టీకి ఎంత కష్టం

ఉప ఎన్నికలతో తగిలిన అదురు దెబ్బ నుంచి కోలుకోవడానికి ఏవేవో ప్రణాళికలు రచిస్తున్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. ప్రజలలో జగన్ పట్ల ఉన్న వ్యామోహం, ప్రభుత్వం పట్ల ఉన్న ద్వేషం సరిదిద్దుకొనే స్థాయిని దాటిపోయాయని ఆయనకు బాగా తెలుసు. కానీ ఏదో ఒకటి చేయకుంటే చేతకాని వాడంటారని భయం. అందువల్లనే సంక్షేమ పథకాల అమలును సమీక్షించడానికి మంత్రులతో ఒక కమిటీ వేశాడు. తాను ఇందిరమ్మ బాట పట్టాడు. నిజానికి వైఎస్ హయాంలో ప్రవేశ పెట్టిన పథకాలన్నీ అమలులోనే ఉన్నాయి తప్ప ఏ ఒక్కటీ ఆగలేదు. ఆనాటికీ ఈనాటికీ భారం మూడు నాలుగింతలు పెరిగినా ప్రభుత్వం భరిస్తున్నది. కానీ ప్రజలు మాత్రం ఆ ఘనత ను కాంగ్రెస్ పార్టీకి ఆపాదించడానికి సిద్ధంగా లేరు. వైఎస్ ప్రవేశపెట్టిన పథకాలు కాబట్టి ఆ కృతజ్ఞత ఏదో ఆయనకే జగన్ రూపంలో తీర్చుకొంటామన్నట్లున్నది వారి ధోరణి. పథకాల సమీక్షతో, పల్లె నిద్రలతో ప్రజల మనసులు మార్చడం జరిగే పని కాదు.

అటువంటప్పుడు కాంగ్రెస్‌ను మళ్లీ బ్రతికించుకోవడం ఎట్లా? ఆ ప్రశ్నకు సమాధానం కుల రాజకీయం అన్న వాదన సీనియర్ కాంగ్రెస్ వాదుల నుంచి విన్పిస్తున్నది. ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో వలె ఇక్కడా కులం ప్రాతిపదికన రాజకీయం నడపడం ద్వారా ప్రజానీకంలో కొంతమేర అయినా స్థానం సంపాదించవచ్చునన్నది వీరి ఆలోచన. ఇందుకు వారు రెండు పద్ధతులు అనుసరిస్తున్నారు. తెలంగాణాలో రెడ్డి కులాన్ని కౌగిలించుకోవడం, ఆంధ్ర ప్రాంతంలో కాపు కులాన్ని అక్కున చేర్చుకోవడం. తెలంగాణా ఉద్యమాన్ని నడుపుతున్న కెసిఆర్ వెలమ కులస్తుడు. అక్కడ రెడ్లు, వెలమలకు సామాజికంగా ఒద్దిక ఉండదు. అందువల్ల కాంగ్రెస్ పార్టీ తెలంగాణా అనుకూల ప్రకటన చేయగానే అన్ని పార్టీలలోని రెడ్లను ఒక వేదిక మీదకు తెచ్చి, ఆ కులాన్ని దత్తత తీసుకోవాలన్నది మొదటి ప్రతిపాదన. ఆంధ్ర ప్రాంతంలో రెడ్డి, కమ్మ సామాజిక వర్గాలు కాంగ్రెస్ దగ్గరకు వచ్చే అవకాశమే లేదు కాబట్టి, కాపు వర్గాన్ని బహిరంగంగా, బాహా

కొరవ 14వ పేజీలో

# సకల దేవతలకు ప్రీతికరమైన శ్రావణమాసం!



సకల దేవతలకు ప్రీతికరమైన మాసం శ్రావణ మాసం. సృష్టి, స్థితి, లయ కారకులైన త్రిమూర్తుల్లో స్థితి కారకుడు, దుష్టశిక్షకుడు, శిష్ట రక్షకుడు అయిన విష్ణుమూర్తికి, ఆయన దేవేరి అయిన శ్రీమహాలక్ష్మికి అత్యంత ప్రీతికరమైన మాసం ఇది. వివిధ పూజలు వ్రతాలు ఆచరించడం వలన విశిష్ట ఫలితాలు, సకల సౌభాగ్యాలను ప్రసాదించే విశిష్టమైన మాసం శ్రావణమాసం. చాంద్రమానం ప్రకారం ఐదవ మాసం శ్రావణం. ఈ మాసంలో పూర్ణిమ నాడు చంద్రుడు శ్రవణానక్షత్ర సమీపంలో వుంటాడు కాబట్టి దీనికి ఆ పేరు వచ్చిందని చెప్తారు. అలాంటి శ్రవణానక్షత్రం పేరుతో ఏర్పడిన మాసం మహావిష్ణువు పూజకు ఉత్కృష్టమైనదిగా పురాణాలు చెప్తున్నాయి.

ఆషాడ మాసం పోయి శ్రావణ మాసం వస్తోందంటేనే పెళ్లిళ్ల, వ్రతాలు ఇతర శుభకార్యాలు తెచ్చే మాసంగా అందరికి ఆనందం కల్గిస్తుంది. ముఖ్యంగా మహిళలు శ్రావణ మాసాన్ని అత్యంత పవిత్రంగా భావించి పూజలు, వ్రతాలు చేస్తారు. ఈ మాసంలో అంతటా పండుగ వాతావరణం నెలకొంటుంది. శ్రావణ మాసంలో లక్ష్మీదేవిని మనసారా పూజిస్తే సిరిసంపదలు చేకూరుతాయని పురాణ కథనం. శుభఫలాల మాసం అయిన శ్రావణంలో ప్రతిరోజూ ఒక్కో ప్రత్యేకతను కల్గి వుంటుంది. మాఘమాసంలో ఆదివారాలు, కార్తీక మాసంలో సోమవారాలు, మార్గశిర మాసంలో శుక్రవారాలు ఇలా ఒక్కో మాసంలో ఒక్కొక్క వారానికి ప్రత్యేకత వుంటే శ్రావణ మాసంలో మాత్రం అన్ని రోజులు పవిత్రమైనవే, ప్రతిదినము ముఖ్యమైనదే. శ్రావణ మాసంలో ఆయా రోజుల్లో అర్చించాల్సిన దేవతల గురించి చెప్పబడింది. ఈ మాసంలో వచ్చే మూడు వారాలు అత్యంత పుణ్య ప్రదమైనవి. మంగళవారం, శుక్రవారం, శనివారాలు ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి. ఎంతో మహత్తు కల్గిన మంగళవారం నాడు గౌరీ పూజను, శుక్రవారం నాడు లక్ష్మీదేవిని, శనివారంనాడు మహావిష్ణువుకు పూజలు చేయాలి. పాడ్యమి నాడు బ్రహ్మను, విదియనాడు శ్రీయపతిని, తదియనాడు పార్వతిని, చవితి నాడు విఘ్నేశ్వరుని, పంచమినాడు శనిని, షష్టినాడు నాగదేవతలను, సప్తమి నాడు సూర్యుడిని, అష్టమినాడు దుర్గాదేవిని, నవమినాడు మాతృదేవతలను, దశమినాడు ధర్మరాజును, ఏకాదశినాడు మహర్షులను, ద్వాదశినాడు మహావిష్ణువును, త్రయోదశినాడు అనంగుడును, చతుర్దశినాడు ఈశ్వరుడిని, పూర్ణిమ నాడు పితృదేవతలను పూజించాలని శాస్త్రవచనం. మహిళలు ఆచరించే వ్రతాలు ఈ మాసంలోనే అధికంగా వుంటాయి. కాబట్టి దీనికి వ్రతాల మాసం అని, సౌభాగాన్ని ప్రసాదించే మాసం అని అంటారు.

సకల దేవతలకు ప్రీతికరమైన శ్రావణ మాసం ఎన్నో పండుగలకు నెలవైనది. నాగ పంచమి, పుత్ర ఏకాదశి, వరలక్ష్మివ్రతం, మంగళగౌరీ వ్రతం, ఋషి పంచమి తదితర పండుగలు ఈమాసంలోనే వస్తాయి. శ్రీమహావిష్ణువు జన్మనక్షత్రం శ్రవణం. అలాంటి నక్షత్రం పేరుతో వచ్చే ఈ మాసంలో మహిళలు మనస్ఫూర్తిగా దేవతలను అర్చిస్తే సౌభాగ్యం కలుగడంతోపాటు సకల శుభాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి.



## ట్రంకు రోడ్డు

### నవ్విపోదురుగాక మాకేమి...

నవ్విపోదురుగాని మాకేమి అన్న చందాన వ్యవహరిస్తున్నారు జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి. నెల్లూరు కార్పొరేషన్ ఏర్పాటుచేసిన పెట్రోల్ బంక్ ప్రారంభోత్సవం సమయంలో వీరిద్దరూ నగరంలో మంచినీటి సమస్య లేదనట్లు మాట్లాడారు. మరో 50ఏళ్ల వరకు మంచినీటి సమస్య రాకుండా చర్యలు కూడా తీసుకొన్నామన్నారు. నెల్లూరులో ఏ మునిసిపల్ కొళాయిలోనైనా అరగంట నీళ్లు వస్తున్నాయా? బోర్లు, మోటార్లు లేకుండా జనం మునిసిపల్ నీళ్ల మీద ఆధారపడే బతుకుతున్నారన్నది కూడా జనంలో తిరిగే వాళ్లమని చెప్పే ఈ ప్రజాప్రతినిధులకు తెలియకుంటే ఎలా?

### సర్కారు మద్యం షాపులు!

పాతరోజుల్లో ప్రభుత్వ సారా అంగళ్లు వుండేవి. వాటిని గుర్తు చేస్తూ నెల్లూరులో ఎక్సైజ్ అండ్ ప్రొహిబిషన్ శాఖాధికారులు ఎపి బేవరేజెస్ కార్పొరేషన్ లిమిటెడ్ యాజమాన్యాన రెండు బ్రాందీ షాపులు పెడుతున్నారు. నగరంలోని చిన్నబజారు, నగరానికి ఆనుకొని వుండే పడుగుపాడుల్లోని బ్రాందీ షాపులను ఎవరూ పాడుకోలేదు. దీంతో దీర్ఘాలోచన చేసిన ఎక్సైజ్ అధికారులు తామే స్వంతంగా షాపులు నడపాలని నిర్ణయించారు. గతంలో షాపులుండే చోటే నడుపుతామని, వాళ్లు షాపులివ్వకుంటే వేరేచోట పెడతామని, ఎవరూ బాడుగకు షాపులివ్వకపోయినా ప్రభుత్వ స్థలంలో రేకుల షెడ్లు వేసి అయినా బ్రాందీ షాపులు పెట్టడం ఖాయమంటున్నారు ఎక్సైజ్ డిప్యూటీ కమిషనర్ నాగేశ్వరరావు గారు. ఈ షాపుల్లోనైనా ఎమ్మార్పీ రేటుకు మద్యం విక్రయిస్తే మందుబాబులు ఇక్కడ బారులు తీరడం ఖాయం.

### కరెంట్ కోతతో కష్టాలు!

వేళాపాళా లేకుండా విధిస్తున్న విద్యుత్ కోతలకు జనం అల్లాడిపోతున్నారు. నగరాల్లో ఉదయం లేచి ఆఫీసులకు, బతుకు తెరువు పనులకు తయారయ్యే సమయంలో విద్యుత్‌కోత విధిస్తున్నారు. ఆఫీసులకు వెళ్లినా 11.30 వరకు పని చేయను విద్యుత్ సరఫరా వుండదు. పనికి మొదలవ్వగానే లంచ్ బ్రేక్. ఉద్యోగులు తిని త్రేపి లేచేలోగా మళ్లీ విద్యుత్ కోతతో ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు నిలిచిపోతున్నాయి. కోతల వాతల మధ్య గృహిణులు ఇళ్లలో ఏ పని చేయలేకపోతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో ఒకసారి విద్యుత్ తీస్తే వరుసగా 12 గంటల పాటు ఇవ్వకపోవడంతో జనం అల్లాడిపోతున్నారు. విద్యుత్ వినియోగానికి మనిషి బానిసవ్వడం వల్ల ఆ సరఫరా ఆగిపోవడంతోనే అతను నిస్తేజితుడైపోతున్నాడు. విద్యుత్ కటకటల కాలంలో భవిష్యత్తు చిత్రం ఊహించుకొని జనం బెంబేలెత్తుతున్నారు.

### ఆలస్యంగా స్పందించారు

మేకపాటి సోదరులు గత 30ఏళ్లుగా ఉదయగిరి ప్రాంతంలోనే రాజకీయాలు చేస్తున్నారు. వారి స్వంత మండలం మర్రిపాడులోని చాలా గ్రామాల ప్రజలు ఫ్లోరిన్ నీళ్లు తాగి నానా ఇబ్బందులు పడుతున్నా వారు పెద్దగా పట్టించుకోలేదు. ఇటీవల ఆయన ఎమ్పీగా గెలిచిన తర్వాత రాజమోహన్‌రెడ్డి తొలి పర్యటన ఫ్లోరోసిస్ పీడిత గ్రామాల్లో చేశారు. చిన్నమాచనూరు, పెద్దమాచనూరు, పోలిరెడ్డిపల్లె, తిక్కవరం గ్రామాల్లో పర్యటించిన ఆయన ఫ్లోరిన్ సమస్య తీర్చను ప్రభుత్వం ఇచ్చే ఎమ్పీ ల్యాడ్ నిధులు ఐదు కోట్ల రూపాయలతోపాటు స్వంత నిధులు ఐదు కోట్లు ఖర్చు పెడతానని గట్టిగా చెప్పారు. మేకపాటి ఈ ప్రకటన చేసి కార్యక్షేత్రంలో దిగకుండా వుండి వుంటే ఓడిపోయిన కాంగ్రెస్ అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి ఈ సమస్య పరిష్కారానికి రంగంలోకి దిగేవాడని జనం వాఖ్యానిస్తున్నారు. పోటీకైనా మేకపాటి పని చేయడానికి ముందుకు రావడాన్ని స్వాగతిస్తున్నారు. పోటీ వుంటేనే పనులు జరిగే రోజులివి.

### ఒక్క సైకో వంద కేసులు

ఒక్కనారి వంద తుపాకులు సినిమా చందాన నెల్లూరులో మొట్టమొదటగా మహిళలను పలు రకాలుగా ఇబ్బందిపెట్టిన 'సైకో సాంబ' మంగళగిరి పోలీసులకు దొరకడంతో ఎందరో మహిళలు సంతోషించారు. నెల్లూరు వన్‌టౌన్ సిఐ సురేష్‌కుమార్‌రెడ్డి గుంటూరుకు వెళ్లి విచారించి వచ్చిన మరుసటి రోజే 'సాంబ' పోలీసులకు హ్యాండిచ్చి తప్పించుకోవడం సంచలనం సృష్టించింది. పాత స్మృతుల్లో మళ్లీ 'సాంబ' సింహపురి ఎక్కడ వస్తాడోనన్న భయం వ్యక్తమౌతోంది. ప్రత్యేక బృందాన్ని ఏర్పాటు చేసినా నెల్లూరు పోలీసులు 'సైకో సాంబ'ను పట్టలేకపోయిన అసమర్థులు మరి!


**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ముఖ్యమైన పనులు నిదానంగా సాగుతాయి. తీసుకొన్న నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఇంటియందు సానుకూల పరిస్థితు లుంటాయి. వృత్తి, వ్యాపారులకు ఆదాయం, ఉద్యోగులకు బదిలీ లలో అనుకూలతలు, విద్యార్థులకు విద్యయందు విజయం లభి స్తుంది. వ్యవసాయదారులు క్లిష్ట పరిస్థితులను అధిగమిస్తారు. కళా, క్రీడాకారులకు ముఖ్యమైన వ్యక్తుల వల్ల మేలు జరుగుతుంది.


**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

అన్ని విషయాలలో జాగ్రత్తలు అవసరం. కానీ నూతనోత్సాహంతో పనులు పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆర్థిక లావా దేవీలు సంతృప్తినిస్తాయి. ఇంటాబయట గౌరవ ప్రతిష్ఠలు పెరుగు తాయి. ఉద్యోగులకు పై అధికారులతో ఇబ్బందులు. వ్యవసాయదా రులకు అధిక శ్రమ. కళా, క్రీడా రంగాలలోని వారికి బాగుం టుంది. రాజకీయవాదులు వాయిదాపడిన పనులు పూర్తి చేస్తారు.


**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

చిన్న చిన్న సమస్యలున్నా అధిగమించి ముందుకుపోతారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగులు తమ ప్రతిభతో రాణిస్తారు. స్థిరాస్తి వివాదా లకు పరిష్కారం లభిస్తుంది. ఉద్యోగులకు స్థానచలనం వుంటుంది. విద్యార్థులు చదువుపై శ్రద్ధ కలిగి వుంటారు. వ్యవసాయదారులకు ఆదాయం వున్నాస్వల్ప అనారోగ్య సమస్యలుంటాయి. కళా, క్రీడా రం గాలలోని వారికి సత్కారాలుంటాయి. రాజకీయులకు అనుకూలం.


**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

గతవారం కన్నా బాగుంటుంది. నూతనోత్సాహంతో పనులు పూర్తి చేస్తారు. ఉద్యోగులకు అనుకూల బదలీలుంటాయి. వృత్తి, వ్యాపారా లలోని వారికి ఆర్థికాభివృద్ధి, శుభవార్తలు వింటారు. విద్యార్థుల ప్రతిభకు తగిన గౌరవం లభిస్తుంది. నూతన సమాచారం లాభి స్తుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి సామాన్యం. రాజకీయ రంగంలోని వారికి సామాన్యంగా వున్నా అధిక ఒత్తిడి వుంటుంది.


**సింహం**
మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

పట్టుదలతో అన్ని పనులు పూర్తి చేస్తారు. అన్ని వర్గాలకు ఆర్థికంగా బాగుంటుంది. విద్యార్థులు చదువులో విజయం సాధిస్తారు. ఇంట్లో వివాహాది శుభకార్యాలు జరుగుతాయి. ఉద్యోగుల ప్రతిభకు తగిన గుర్తింపు లభిస్తుంది. వ్యవసాయదారులు చక్కటి ప్రణాళికలతో విజ యం సాధిస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి కొన్ని సంఘటనలు లాభిస్తాయి. రాజకీయులకు ఆకస్మిక, విదేశీ ప్రయాణాలుంటాయి.


**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

ఈ రాశి వారికి అన్ని విధాల అనుకూలం. నూతన భూ, గృహ నిర్మాణాది కార్యాలు చేయగలరు. వృత్తి, వ్యాపారులకు ఆర్థికాభి వృద్ధి వుంటుంది. ఉద్యోగులకు స్వల్ప ఆటంకాలున్నా అనుకూల బద లీలుంటాయి. విద్యార్థులకు ఉత్సాహం, ధనాదాయం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి అనుకోని ఆహ్వానాలుంటాయి. రాజ కీయ నాయకులు ఉత్సాహంతో ముందుకు సాగుతారు.

# వారఫలాలు

తేది 21-07-2012 నుండి 27-07-2012 వరకు వృషభంలో గురు, శుక్ర, కేతువులు; కర్కాటకంలో రవి, బుధులు; కన్యలో కుజ, శనులు; వృశ్చికంలో రాహువు; కర్కాటక, సింహ, కన్య, తులలలో చంద్రుడు సంచరిస్తారు.

## పంచాంగం

22తేది సింహాయనం, దూర్వగణపతి వ్రతం, మధుశ్రావణి వ్రతం.
23తేది నాగుల చవితి, నాగుల పంచమి, గరుడ పంచమి.
24తేది మంగళగౌరి వ్రతం ప్రారంభం, సామవేద ఉపాకర్మలు.
27తేది వరలక్ష్మీ వ్రతం.

### శుభ ముహూర్తాలు

25తేది వ్యాపార సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### జూలై తిథులు
శ్రావణ శుద్ధ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21 | శని | విదియ | ప | 09.52 | గం.ల.వ |
| 22 | ఆది | తదియ | ప | 09.12 | గం.ల.వ |
| 23 | సోమ | చవితి | ప | 08.11 | గం.ల.వ |
| 24 | మంగళ | పంచమి | ఉ | 06.51 | గం.ల.వ |
| | తదుపరి | షష్ఠి | తె | 05.14 | గం.ల.వ |
| 25 | బుధ | సప్తమి | రా | 03.24 | గం.ల.వ |
| 26 | గురు | అష్టమి | రా | 01.21 | గం.ల.వ |
| 27 | శుక్ర | నవమి | రా | 11.07 | గం.ల.వ |

**అక్కిరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.


**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

అన్ని విధాల అనుకూలంగా వుంటుంది. నూతన భూ, గృహ నిర్మాణ కార్యక్రమాలు చేయగలరు. వృత్తి, వ్యాపారుల ఆర్థికాభివృద్ధి బాగుం టుంది. ఉద్యోగులకు స్వల్ప ఆటంకాలున్నా అనుకూల బదలీలుం టాయి. విద్యార్థులకు ఉత్సాహం, ధనాదాయం వుంటుంది. వ్యవ సాయ పనులు బాగున్నా, ఇంట్లో చిన్నపాటి భేదాభిప్రాయాలు కలగ వచ్చు. కళా, క్రీడా రంగాలవారికి అనుకోని ఆహ్వానాలుంటాయి.


**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ

గతవారం కన్నా ఈ వారం బాగుంటుంది. పరిష్కారం కాని పనులు పూర్తి చేయగలరు. వృత్తి, వ్యాపారాలు పుంజుకుంటాయి. ఆర్థికాదా యం లభిస్తుంది. ఉద్యోగులకు శ్రమానంతరం బదలీలుంటాయి. విద్యార్థులు నూతనోత్సాహంతో వుంటారు. వ్యవసాయదారులకు ఆర్థికపుష్టి. కళా, క్రీడా రంగాలలోని వ్యక్తులు పట్టుదలతో పనులు పూర్తి చేయగలుగుతారు. రాజకీయ వర్గాల వారికి అనుకూలం.


**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగుల ఆర్థికస్థితి బాగుంటుంది. ఇంటాబయట గల చిక్కులు తొలగి మీ ప్రతిభ తెలుస్తుంది. ఉద్యోగుల వివాదాలు పరిష్కారమౌతాయి. విద్యార్థులు పట్టుదలతో తమ సమస్యలకు నిర్ణ యాలు తీసుకొంటారు. వ్యవసాయదారులకున్న చిన్నపాటి అడ్డం కులు తొలగి ఆదాయం పెరుగుతుంది. రాజకీయాలలోని వారు తమ పైవర్గాల వారిని మెప్పిస్తారు. ఎంతటివారినైనా ఆకట్టుకొంటారు.


**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

నూతనోత్సాహంతో పనులు ఆరంభిస్తారు. కొన్ని సమస్యలు తీరి మనశ్శాంతి లభిస్తుంది. ఇంటియందు వివాహాది శుభకార్యాలు చేస్తారు. విలువైన వస్తు సేకరణ చేయగలరు. వృత్తి, వ్యాపారాలు ఆర్థికంగా బాగుంటాయి. వ్యవసాయదారులకు ఆర్థికపుష్టి వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారు తమ వృత్తి పరిధిని విస్తరిస్తారు. రాజకీయాలలోని వారికి ఒత్తిడులు తగ్గి మనశ్శాంతి లభిస్తుంది.


**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఆర్థిక ఇబ్బందులు నిరాశ కలిగిస్తాయి. కానీ అవసరాలకు ధనం లభి స్తుంది. స్థిరాస్తి వివాదాలు పరిష్కారమౌతాయి. ఉద్యోగులకు గట్టి ప్రయత్నంపై బదలీలు, దూర ప్రయాణాలు లాభిస్తాయి. విద్యార్థు లకు ప్రశంసలు లభిస్తాయి. వ్యవసాయదారులకు అధికాదాయం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి ధన వ్యయం, ఆలోచన లలో స్థిరత్వం వుండదు. రాజకీయులకు పునరాలోచన అవసరం.


**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

పనులన్నీ వాయిదా పడతాయి. సమస్యలకు ఆధ్యాత్మిక చింతన అవ సరం. వృత్తి, వ్యాపారుల ఆర్థికస్థితి సామాన్యం. ఉద్యోగాలలోని వారికి స్థానచలనం, తమ వృత్తిపై బాధ్యత అవసరం. విద్యార్థులు చదువుతోపాటు నూతన అవకాశాలకు శ్రీకారం చుడతారు. వ్యవ సాయదారులకు ఆర్థికంగా సామాన్యం. మనోధైర్యం అవసరం. కళా, క్రీడా రంగాలలోని వారికి మనస్థాపం.

# యుగాంతం అనూహ్యం... అనిర్ణయాత్మకం!

*డాక్టర్ శ్యామ్‌సుందరరెడ్డి చెన్నై*
*★ యుగాంతాన్ని గురించి చాలా ప్రచారా లున్నాయి. 'మయ' క్యాలెండర్ అందులో ఒకటి. శాస్త్రాలేమి చెబుతున్నాయి.*

'మయ' క్యాలెండర్ ఒక కాలమానమే తప్ప, నిర్ధారించబడిన 'యుగాంతం' కాదు. త్రేతాయుగం (12,96,000), ద్వాపరయుగం(8,64,000) సంవత్సరాల్లో అనేక ప్రళయాలు, భూకంపాలు జరిగాయి. వేటితోనూ భూమి అంతంకాలేదని శాస్త్రాలు చెబుతున్నాయి.

*డి.జగన్నాధశర్మ తడ*
*★ ఈశాన్యంలో వృక్షాన్ని కొట్టివేశాక నా ఆరోగ్యం పాడయింది. పరిష్కారం చెప్పండి?*

మీరు స్కూళ్లు, మరే ఇతరత్రా పబ్లిక్ ప్రాంతాల్లో వంద చెట్లను నాటి, దోష నివారణకు దేవుడి గదిలో కుబేర యంత్రం(ప్రధమార్థ) ప్రతిష్టించండి.

*డి.వి.ఆర్.మణి ఒంగోలు*
*★ తూర్పు యింటికి ఆగ్నేయం బాత్‌రూం, ఈశాన్యం మెట్లు తప్పుంటున్నారు.*

ఆగ్నేయం సెప్టిక్ ట్యాంకులేని లెట్రిన్, బాత్‌రూంలు ఉండవచ్చు. తూర్పు గృహానికి ఆగ్నేయం మెట్లు సరైనవి. అయితే అవి తూర్పు ఈశాన్యం ప్రవేశం కలిగి ఉండాలి. ఉత్తర ఈశాన్యంలోకి కాదు.

*ఎం.ఉమాదేవి కర్నూలు*
*★ వాస్తును సరిచేసుకున్న తర్వాత కూడా కొన్ని సమస్యలు వస్తున్నాయి.*

సూక్ష్మ, కోణ సదృశ్య వేధలున్నపుడు ఇలా జరుగుతాయి. సంబంధిత యంత్ర ప్రతిష్ట సమస్యల్ని శాశ్వతంగా తొలగిస్తాయి.

*ఎన్.అనసూయమ్మ నెల్లూరు*
*★ అపార్టుమెంటులో 'ప్లాటు' ప్లాను పంపిస్తున్నాను. పరిష్కారం చెప్పండి?*

బయటి, లోపలి వాస్తులు రెండూ బాగా లేవు. ఇప్పుడిక చేయగలిగింది సుదర్శన యంత్ర ప్రతిష్ట మాత్రమే. ఆరు నెలల్లో పరిస్థితి మారక పోతే 'ప్లాటు' ఖాళీ చేయండి.

*డి.అశోక్‌నాయుడు ఆత్మకూరు*
*★ మరణం, రోగం ఇవి మా యింట మామూలైపోయాయి. ప్లాను పంపిస్తున్నాను.*

నైరుతి సెప్టిక్ ట్యాంకును వెంటనే తొలగించి తూర్పువైపుకు ఈశాన్యానికి ఆవల ఏర్పాటు చేయండి. ఈశాన్యం 'కుంభ' ప్రతిష్ట చేయించండి.

*ఎన్.సత్యనారాయణరావు హైదరాబాద్*
*★ జ్యోతిష శాస్త్రం పున్నమి, అమావాస్య రోజుల సముద్రాన్ని గురించి వివరించిందంటారా?*

వశిష్ట సంహిత, మయవాస్తులో చంద్రుడి ప్రభావ విశ్లేషణలున్నాయి. సముద్రం ఉప్పొంగి ప్రవహించడం(హై టైడ్) తిరిగి వెనక్కి వెళ్లి పోవడం(లో టైడ్) ఆటు, పోటు చంద్ర ప్రభావ, ఆకర్షణల వల్లే జరుగుతాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జె.థామస్ ఒంగోలు*
*★ వృక్షాలు, మొక్కలు వీటి పెంపకాన్ని గురించి శాస్త్రాలేం చెప్పాయి?*

సువిశాలమైన ప్రాంతాల్లో గృహాలకు దక్షిణ, పశ్చిమాల్లో వృక్షాలను (అడవి వృక్షాలు తప్ప) సాధారణ గృహ ప్రాంగణంలో మొక్కల్ని పెంచుకోవచ్చని శాస్త్ర పాఠం.

*కె.అరుణ శ్రీకాళహస్తి*
*★ పాపకు ఆరోగ్యం బాగుపడుతుందా? పాప మాకు దక్కుతుందా?*

గృహం ప్లానులో ఏ లోపమూ లేదు. మీవి అనవసర భయాలు. ముందు పిల్లల డాక్టర్ని కలవండి. ఆ తర్వాత గణపతి పూజ మండలం రోజులు దీక్షగా చేయండి. పాపకు ఏ భయమూ లేదు!

*షేక్ గౌస్‌బేగం నెల్లూరు*
*★ నైరుతి గదిలో యజమాని నిద్ర అంటారెందుకు?*

నైరుతి ఎత్తుగానూ, తేమరహితంగానూ ఉండి బాక్టీరియా, వైరస్‌లను చేరనీయదు. ముసలివాళ్లు రోగగ్రస్తులు కారు గనుక! దక్షిణం కిటికీ నుంచి వీచే గాలి ఆరోగ్యప్రదాయిని గనుక!!

*జి.శంకరరావు తిరుపతి*
*★ ఆరు నెలల క్రితం జామచెట్టును కొట్టాక ఉదరశూల ప్రారంభమై ఎంతకీ తగ్గడం లేదు.*

వృక్షవేధ మహాబాధ అన్నది శాస్త్రం మాట. మీ గృహంలో, కార్యాలయంలో, అవకాశం ఉన్నచోట ఓ వంద మొక్కలు నాటి పెంచండి. ఫలితం ఉంటుంది.

# పోలీసుల జేబులు నింపుతున్న ఇసుక ట్రాక్టర్లు!




దర్జాగా ఇసుకను తోలుకెళ్తున్న ట్రాక్టర్లు.

**పొట్టేపాళెం, జొన్నవాడ, ముదివర్తి ఇసుకరీచ్‌ల నుంచి దొంగతనంగా ఇసుక తరలించుక పోతున్న ట్రాక్టర్లు పోలీసులకు కనకవర్షం కురిపిస్తున్నాయి. ఈ అక్రమార్కులను అరెస్ట్ చేయాల్సింది పోయి లంచం తీసుకొని పోలీసులు వీరిని వదలిపెట్టేస్తున్నారు.**

జిల్లాలో ఇసుకరీచ్‌ల నుంచి ఇసుక రవాణాపై నిషేధం వుండడం కొందరికి కాసుల వర్షం కురుస్తుంది. నిషేధం కారణంగా ఇసుకకు డిమాండ్ ఏర్పడింది. భవన నిర్మాణాలు సైతం ఇసుక కొరత కారణంగా నిలిచిపోయాయి. కొందరు ఇసుక కాంట్రాక్టర్లు అర్ధ రాత్రిపూట ట్రాక్టర్ల ద్వారా రీచ్‌ల నుంచి ఇసుకను తరలిస్తున్నారు. వీరి బాటలో మరికొందరు ట్రాక్టర్ల యజమానులు ఇసుకను వాహనాల్లో తరలిస్తున్నారు. పొట్టేపాళెం, జొన్నవాడ, ముదివర్తి ఇసుకరీచ్‌ల నుంచి ప్రతి రోజు ఇసుక తరలించుకపోతున్నారు. నిషేధం అమల్లో వున్న సమయంలో ఇసుకను రవాణా చేస్తే కేసు నమోదు చేయాలని హైకోర్టు ఉత్తర్వులున్నాయి. సంబంధిత పోలీసు స్టేషన్లకు చెందిన పోలీసులు ఇసుకను తీసుకెళ్లే వాహనాలపై కేసులు నమోదు చేయకుండా మామూళ్లు తీసుకొని వదిలేస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి.

విధి నిర్వహణలో వున్న కానిస్టేబుళ్లతోపాటు విధి నిర్వహణలో లేని వారు సైతం ఇసుక ట్రాక్టర్లు ఏ మార్గంలో వెళుతున్నాయన్న సమాచారాన్ని ముందుగా సేకరించుకొని అక్కడ మాటువేస్తున్నారు. ఇసుకకు బాగా డిమాండ్ పెరగడంతో మామూళ్లను కూడా పోలీసులు పెంచేశారు. నెల్లూరు నగరంలో వివిధ పోలీసు స్టేషన్లలో పోలీసులు 24 గంటలు మామూళ్లను వసూలు చేస్తుంటారు. పోలీసు యూనిఫాంలో కాకుండా సాధారణ దుస్తుల్లో దర్శనమిస్తున్నారు. మామూళ్లు అడుగుతున్న వారిలో ఎవరు పోలీసులో, ఎవరు బయటి వ్యక్తులు తెలుసుకోవడం కష్టతరంగా మారిందని వాహన యజమానులు, డ్రైవర్లు చెబుతున్నారు. వాహనాలను నిలిపి డ్రైవర్లను మామూళ్లు అడగడంతో యజమాని వస్తాడని విన్నవించుకుంటున్నప్పటికి దౌర్జన్యంగా ప్రవర్తిస్తుంటారు.

ఇటీవల ఇందుకూరుపేట పోలీసుస్టేషన్‌కు చెందిన ఇద్దరు పోలీసులు సాధారణ దుస్తుల్లో కొత్త పెన్నా బ్రిడ్జిపై ఒక ఇసుక ట్రాక్టర్‌ను నిలిపి నగదు డిమాండ్ చేశారట. ట్రాక్టర్ డ్రైవర్ ఓనర్ వస్తాడని అప్పటి వరకు వాహనాన్ని ప్రక్కన నిలుపుతానని చెప్పినా వినని పోలీసులు రోడ్డుపైనే నిలిపివేశారు. చీకటి కావడం వలన విజయవాడ నుంచి చెన్నై వైపు వెళుతున్న ఐషర్ మినిట్రక్కు ట్రాక్టరును ఢీకొట్టింది. ఈ ప్రమాదంలో ట్రక్కు క్లీనర్ దుర్మరణం చెందారు. ప్రమాదం జరిగిన తర్వాత ఇరువురు పోలీసులు ఆ ప్రాంతం నుంచి అదృశ్యం అయ్యారు. కేవలం మామూళ్ల కోసం వాహనాన్ని నడిరోడ్డుపై నిలిపిన కారణంగా ఒక వ్యక్తి ప్రాణాలు గాలిలో కలసిపోయాయి. ఇందుకు కారకులైన పోలీసులను ఇప్పటివరకు గుర్తించలేకపోవడం విశేషం.

## పోలీసు వాహనాలతో ఇబ్బంది

నెల్లూరు నగరంలో పోలీసు వాహనాల కారణంగా ప్రజలు, వాహన చోదకులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఎక్కడ పడితే అక్కడ వాహనాలను రోడ్డుకు అడ్డంగా నిలిపివేయడం జరుగుతుంది. సామాన్య ప్రజలు ట్రాఫిక్ నిబంధనలు ఉల్లంఘిస్తే జరిమానాలు విధిస్తుంటారు పోలీసులు. మరి అదే పోలీసులు ఇష్టానుసారంగా వాహనాన్ని నడిపినా, రోడ్డుపై పార్కింగ్ చేసినా పట్టించుకునే వారు లేకుండా పోయారు. పోలీసులమన్న పొగరుతో ప్రశ్నించిన వారిపై దురుసుగా ప్రవర్తిస్తుంటారు. వాహనాల్లో పోలీసు అధికారులు ఎవరు లేకున్నా డ్రైవర్లు మాత్రం నగరంలో సైరన్ మోగిస్తూ షికార్లు చేస్తుంటారు. పోలీసు జీపును అధిక వేగంతో నడపడం కారణంగా ఇతరుల వాహనాలు ప్రమాదాలకు గురవుతున్నాయి. అధికారులు లేకుండానే డ్రైవర్లు జీపును తిప్పడం విరుద్ధం.

పోలీసు అధికారులు భోజనానికెళ్లిన సమయంలో డ్రైవర్లు జీపును తీసుకెళ్లి జాతీయ రహదారిపై ఆపి గేదెలను తీసుకెళ్లే వాహనాల నుంచి మామూళ్లు వసూలు చేస్తుంటారు. ఇటీవల కాలంలో అధికారుల పర్యవేక్షణ లోపించడంతో పోలీసుశాఖ పరువు బజారున పడుతుంది. ఇప్పటికైనా పోలీసు బాస్ స్పందించి ఇసుక ట్రాక్టర్ల నుంచి మామూళ్లకు పాల్పడుతున్న వారిపై కఠిన చర్యలు తీసుకోవడంతోపాటు, నగరంలో పోలీసు జీపులు అడ్డదిడ్డంగా నడపకుండా నియంత్రించాల్సిన అవసరం వుంది.

ఇందిరమ్మ బాటేది?

# ఇందిరమ్మ బాటపై ప్రజాప్రతినిధుల వెనుకడుగు!

**ప్రజల్లోకి వెళ్లి వాళ్ల సమస్యలు పరిష్కరించాలన్న ఉద్దేశ్యంతో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రకటించిన ఇందిరమ్మ బాట కార్యక్రమంలో పాల్గొనను అధికార పార్టీ ఎమ్మెల్యేలు, మంత్రులు ముందు వెనుకా ఆలోచిస్తున్నారు. ప్రజలు పలు సమస్యలు ఎదుర్కొంటున్న ప్రస్తుత తరుణంలో ఈ బాట నడవను సంశయిస్తున్నారు.**

రాష్ట్ర ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి గ్రామీణ ప్రాంతాల్లో పర్యటించి ప్రభుత్వ పనితీరును వివరించాలన్న ఉద్దేశ్యంతో "ఇందిరమ్మ బాట" అనే కొత్త కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. ముఖ్యమంత్రి ప్రకటించిన విధంగా ఎమ్మెల్యేలు, మంత్రులు నియోజకవర్గాల్లో పర్యటించేందుకు వెనుకడుగు వేస్తున్నారు. ప్రస్తుతం రాష్ట్రవ్యాప్తంగా విద్యుత్ కోత, అధిక ధరలు, రైతులకు గిట్టుబాటు ధర తదితర సమస్యలతో ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. ఈ క్రమంలో ఇందిరమ్మ బాట పేరుతో గ్రామాలకు వెళితే ప్రజల నుంచి నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుందని ప్రజా ప్రతినిధులు భయపడుతున్నారు. 2009 సంవత్సరంలో ఎమ్మెల్యేలుగా గెలుపొందిన తర్వాత ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలకు తప్ప ప్రజల సమస్యలను తెలుసుకొనేందుకు ప్రజాప్రతినిధులు పర్యటించిన దాఖలాలు లేవు.

ముఖ్యమంత్రి ఆదేశాలతో తప్పనిసరి పరిస్థితుల్లో గ్రామాలకు వెళ్లాల్సి వస్తుంది. మన జిల్లాలో "ఇందిరమ్మ బాట" కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు. ప్రస్తుతం అధికారపార్టీకి చెందిన ఎమ్మెల్యేలు, ప్రతిపక్షపార్టీ ఎమ్మెల్యేలు ఎవరు కూడా ప్రజలు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలపై దృష్టి సారించి పరిష్కరించేందుకు కృషి చేయడం లేదు. నియోజక వర్గాల పరిధిలోని మండల తహశీల్దార్లు, ఎంపిడిఓలు ఇతర శాఖల అధికారులతో సంక్షేమ పథకాలు ఏవిధంగా అమలు జరుపుతున్నారన్న దానిపై సమీక్షలు చేయడం లేదు. గ్రామీణ ప్రాంతాల్లో మంజూరు చేసిన ఇందిరమ్మ గృహాలు నిధుల కొరత కారణంగా నిర్మాణాలు పూర్తిగాక అధికారుల వైఖరిని వెక్కిరిస్తున్నాయి. రేషన్ కార్డుల కోసం సంవత్సరాల తరబడి నిరీక్షిస్తున్న వారు అనేకమంది వున్నారు. త్రాగునీటి సరఫరా సక్రమంగా జరగక అపరిశుభ్రమైన నీటినే తాగుతున్నారు.

గతంలో ప్రజాపథం కార్యక్రమం పేరుతో ప్రజా ప్రతినిధులు, అధికారులు గ్రామాలకు వెళ్లే వారు. ఈ కార్యక్రమం సందర్భంగా ప్రజలకు ఎటువంటి ప్రయోజనం కలగలేదు. పైగా అధికారులకు సమయం వృధా అయ్యింది. ప్రజాపథం నిర్వహించిన అన్ని రోజుల్లో ప్రభుత్వ కార్యాలయాలు వెలవెలబోయాయి. ఈ కార్యక్రమంతోపాటు రైతు సదస్సులు, రెవెన్యూ సదస్సులు తదితర కార్యక్రమాలను నిర్వహించాలని ఆదేశిస్తున్న ముఖ్యమంత్రి ప్రజల అవసరాలను తీర్చేందుకు కావలసిన నిధులు విడుదల చేయడం లేదు. దీంతో అధికారులు, ప్రజాప్రతినిధులు ఒక ప్రక్క అసంతృప్తి వ్యక్తం చేస్తూనే మరో ప్రక్క ప్రజలకు ఏదో రకంగా సర్దిచెప్పి బయటపడుతున్నారు. ప్రతిపక్ష పార్టీలకు చెందిన శాసనసభ్యులు నిధుల మంజూరు చేయడంలో ప్రభుత్వం విఫలమైందంటూ విమర్శనాస్త్రాలు సంధిస్తున్నారు.

జిల్లాకు చెందిన మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి త్వరలో నెల్లూరుకు చేరుకుని ఇందిరమ్మ బాట నిర్వహణపై జిల్లా కలెక్టర్, ఇతర శాఖల అధికారులతో సమావేశం కానున్నారు. అన్ని శాఖల అధికారులతో చర్చించనున్నారు. అన్ని శాఖలు సమన్వయంతో ఇందిరమ్మ బాటను విజయవంతం చేయాలన్న ఆదేశాలు ఇప్పటికే కలెక్టరేట్‌కు చేరాయి. జిల్లా మంత్రి అనుమతి లేనిదే ఏ ఫైలు ముందుకు కదలని పరిస్థితి వుంది. అధికార యంత్రాంగం కూడా మంత్రి ఆదేశాలకు విరుద్ధంగా విధులు నిర్వహించే అవకాశం లేదు. త్వరలో జరగబోయే ఇందిరమ్మ బాట కార్యక్రమం పేరుతో గ్రామాలకు వెళ్లే అధికారులు, ఎమ్మెల్యేలను ప్రజలు వివిధ సమస్యలపై ప్రశ్నించే అవకాశం లేకపోలేదు. గృహనిర్మాణశాఖ అధికారులు ఇందిరమ్మ గృహాల నిర్మాణాలకు సంబంధించిన పూర్తి సమాచారాన్ని ముందు జాగ్రత్తగా పొందుపర్చుకొంటున్నారు.

ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాల్లో జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా చేపట్టిన పనులు మాత్రం జరుగుతున్నాయి. సామాజిక తనిఖీల్లో నిధుల దుర్వినియోగం బయటపడుతున్నా అధికారపార్టీ నేతల సహకారంతో మరుగునపడిపోతోంది. ఈ పథకం అమలు తీరుపై కూడా అనేక ఆరోపణలు, విమర్శలు వున్నాయి. ఇందిరమ్మ బాట కార్యక్రమం జిల్లా ప్రజలకు ఎటువంటి ప్రయోజనం కలిగిస్తుందో కొద్ది రోజులు వేచి చూడాలి.



## నచ్చిన సినిమానే చేస్తా!

హీరోయిన్‌గా కంగనా రనౌత్ ప్రయాణం బాలీవుడ్‌లో ఒడిదుడుకుల మధ్య సాగుతోంది. మంచి పాత్రలే ఎంచుకొంటున్నా, ఎక్కువ సినిమాలు బాక్సాఫీసు దగ్గర బోల్తా కొడుతున్నాయి. దీంతో కంగనాను సినిమాకు ఎంచుకొనే ముందు ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తున్నారు నిర్మాతలు. మరోవైపు వ్యక్తిగత ప్రవర్తన కూడ ఆమెను కష్టాల్లోకి నెడుతుంది. గతంలో ఎందరితోనో తిరిగిన ఆమె ప్రస్తుతం ఇంగ్లండ్‌కు చెందిన నికోలస్ లాపెర్టీ అనే యువకుడితో ప్రేమాయణం సాగిస్తున్నట్లు వార్తలొస్తున్నాయి. అయితే ఈ విషయాన్ని కంగనా పెద్దగా పట్టించుకోవడం లేదు. హీరోయిన్లకు స్నేహితులు వుండకూడదా అంటుంది. సినిమాల గూర్చి మాట్లాడుతూ నాకు అవకాశాలు తగ్గాయని ఎవరు చెప్పారు? కథల ఎంపికలో నేను చాలా జాగ్రత్తగా వుంటాను. నచ్చిన సినిమా వస్తేనే చేస్తా. అందుకే సినిమాలు తగ్గాయని సర్దిచెప్పుకొంటోంది.



## భక్తిపూర్వక అనుభవం



నెల్లూరీయుడు ఆల్తూరి మహేష్‌రెడ్డి తీస్తున్న శిరిడిసాయి చిత్రంలో నటిస్తున్నప్పటి నుంచి చిత్రవిచిత్రాలు తన కళ్ల ముందు కనపడుతున్నాయని నటుడు నాగార్జున చెప్పారు. బాబా రూపం కళ్ల ముందు ప్రత్యక్షమయ్యేది. పేపర్ తెరచినప్పుడు, లారీలు, ఆటోలపైనా బాబా దర్శనమిచ్చేవారు. చేయి ఎత్తి ఆశీర్వదిస్తున్నట్లుంది. ఓసారి షూటింగ్ అయ్యి ఇంటికి వచ్చాను. చీకటిగా వుండింది. అక్కడ రేడియమ్ వెలుగులతో ధగధగ మెరిసే బాబా విగ్రహం కనిపించింది. ఇంట్లో ఎవరిని అడిగినా... ఆ విగ్రహం ఎవరు తీసుకొచ్చారో మాకు తెలియదని సమాధానమిచ్చారు. ఇదే విషయం దర్శకుడు రాఘవేంద్రరావుకు చెప్పాను. ఆయన చాలా సంతోషించారు. ఈ సినిమాకు పని చేసినన్ని రోజులూ ఏదో ఒక మాయలా, మంత్రంలా అనిపించిందన్నారు నాగార్జున.

## సిద్ధార్థకు ఆపరేషన్

హీరో సిద్ధార్థ ఇటీవలే తన కళ్లకు ఆపరేషన్ చేయించుకొన్నాడు. ఆయన సినిమాల్లో పాత్రకు తగ్గ ఆహార్యంతో కొన్ని చోట్ల వుండి, మరికొన్ని చోట్ల కంటి అద్దాలతో కనిపించేవారు. ఈ విషయాన్ని ఆయన వివరిస్తూ ఇటీవలే లాసిక్ సర్జరీ చేయించుకొన్నాను. ఏళ్ల తరబడి కంటి అద్దాలు మోశాను. ఇక వాటి భారం తప్పింది. ఈ సర్జరీ తర్వాత అనిపించింది మన వైద్యశాస్త్రం ఎంతగా ఎదిగిపోయిందో. నొప్పి తెలియకుండానే శస్త్రచికిత్స పూర్తయ్యిందన్నారు.

## సమంతకు ఎలర్జీ!

హీరోయిన్ సమంతకు ఆరోగ్యం సరిగా లేదని, కొన్ని వారాలపాటు విశ్రాంతి అవసరమని వైద్యులు సూచించారట. ఆమెకు ఎలర్జీ మూలంగా శరీరం మీద దద్దుర్లు వచ్చాయట. దీనికోసం సమంత చికిత్స పొందుతోంది. వైద్యుల సలహా ఏమిటంటే, ఎక్కువ సూర్యకాంతిగానీ, వేడిలైట్లుగానీ శరీరం మీద పడకూడదు. సినిమాల్లో పెద్దపెద్ద లైట్లు, రిఫ్లెక్టర్లు వుంటాయి. ఆ వేడి తగిలితే ఎలర్జీ మరింత ఎక్కువయ్యే అవకాశాలున్నాయి. ఇప్పుడామె చిక్సిత కోసం ఆస్ట్రేలియా వెళ్తుంది. ఈ కారణంగానే శంకర్ చిత్రానికి తీసుకొన్న అడ్వాన్సను తిరిగి ఇచ్చేసింది.

## ఆదిత్య 369 సీక్వెల్‌లో లేను!



బాలకృష్ణతో కలసి తాప్సి ఆడిపాడబోతుందా? గత కొద్దిరోజులుగా తెలుగు సినిమా వర్గాల్లో జరుగుతున్న చర్చయిది. ఆదిత్య 369 చిత్రానికి సీక్వెల్ రూపొందించేందుకు సన్నాహాలు మొదలయ్యాయి. ఈ చిత్రానికి సైతం సింగీతం శ్రీనివాసరావునే దర్శకుడు. ప్రొగెస్‌లో వున్న ఈ చిత్రంలో తాప్సిని హీరోయిన్‌గా ఎంచుకొన్నట్లు ప్రచారం జరిగింది. కాని ఈ విషయాన్ని తాప్సి ఖండించింది. తన ముందు ఈ చిత్ర ప్రతిపాదనే రాలేదంది. ఆమె నటించిన గుండెల్లో గోదావరి విడుదలకు ముస్తాబవుతోంది. వెంకటేష్, గోపీచంద్‌ల సరసన రెండు చిత్రాల్లో ఆమె నటిస్తుంది.

## టైమ్ పాస్ – డేవిడ్ బిల్లా!

✍ అల్లూరు రహీం

చీకటి సామ్రాజ్యాన్ని ఏలే అండర్ వరల్డ్ డాన్లపై ఇప్పటికే వెండి తెరపై పలు చిత్రాలొచ్చాయి. యుగంధర్, బిల్లా, డాన్‌లు ఈ కోవలోనివే. తమిళంలో అజిత్ హీరోగా గతంలో వచ్చిన 'బిల్లా' చిత్రానికి ప్రీక్వెల్ డేవిడ్ బిల్లా చిత్రం. అంటే బిల్లాగా ఎదగడానికి ముందు జరిగిన పరిణామాలు ఈ చిత్రంలో చూపించారు. ఇటువంటి చిత్రాలకు టేకింగ్, స్క్రీన్‌ప్లేతో ప్రాణం పోయాలి. ప్రేక్షకులు కుర్చీలోంచి లేవకుండా కథనడపాలి. ఈ విషయంలో దర్శకుడు తోలేటి చక్రి విజయవంతమయ్యాడనే చెప్పాలి. సాగర సంగమం చిత్రంలో భంగిమ అంటూ ఫోటోగ్రాఫర్‌గా కనిపించే బాలుడే ఈ చిత్ర దర్శకుడు చక్రి. కేవలం రెండు గంటల సినిమా 'డేవిడ్ బిల్లా'ను చాలా స్టైలిష్‌గా తీశాడు. నిర్మాతల చేత ఖర్చు పెట్టించినా ప్రతి పైసా తెరపై కనపడేట్లు చేశాడు. బరోవియా దేశంతోపాటు రష్యా కార్నివాల్‌ను కథానుగుణంగా వాడుకొన్న తీరు బాగుంది. గోవా అందాలనైతే కెమెరామెన్ ఆర్.డి.రాజశేఖర్ ప్రేక్షకులు మెచ్చేలా చూపించాడు. ట్రైన్‌తోపాటు హెలికాప్టర్ ఫైట్ వంటి రిస్కీ షాట్లలో హీరో అజిత్ అలవోకగా నటించాడు. సహజంగా ఉండే పోరాటాలు హాలీవుడ్ చిత్రాన్ని గుర్తుకు తెస్తాయి. ఈ చిత్రంలోని మూడు పాటలు క్లబ్బులు, పబ్బులు, కాసినోలలో ఉంటాయి. ఈ పాటల్లో కనిపించే నర్తకీమణుల అందాలను చూడను ఐదారుకళ్లు కావాలి. స్మగ్లింగ్‌లో రకాలు, అవి చేసే పద్ధతులు, మధ్యలో ప్రత్యర్థులతో పోరాటాలు ఈ చిత్రం ఆసక్తికరంగా సాగినా సిఎంకు సెక్యూరిటీగా ఒకే ఒక జీపు ఉండడం, ఆయన్ను పిట్టను కాల్చినట్లు కాల్చేయడం కాస్త విడ్డూరమనిపిస్తుంది. జడ్జిని బెదిరించి బిల్లా బెయిల్ పొందడం ప్రస్తుతం జరుగుతున్న గాలి జనార్దన్‌రెడ్డి బెయిల్ ఎపిసోడ్‌ను ప్రేక్షకులకు గుర్తుకు తెస్తుంది. చిత్రంలో చాలా సన్నివేశాలు తమిళ సబ్ టైటిల్స్‌తో నడపడం ఘోరం. అయితే ఎదుటివాడి భయమే మన బలం, మంచి వాళ్లను కనిపెట్టడం కష్టం. చావు ఉన్నంత కాలం ఆయుధాలకు మార్కెట్టే; కష్టపడితేనే పైకొస్తాం డైలాగులు ఆలోచింపజేస్తాయి.




చిత్ర కథలోనికి వెళ్తే శ్రీలంకలోని పరుత్తికోన ప్రాంతం నుంచి వచ్చే వారి కోసం చెన్నైలో నడిపే కాందిశీకుల కాలనీకి డేవిడ్ బిల్లా (అజిత్) వస్తాడు. ఇక్కడ కాందిశీకులపై జులుం చెలాయించే ముత్తయ్యను కొడతాడు. అతను ఇక్కడి క్యాంప్ సెక్యూరిటీ అధికారిగా వ్యవహరించే రఘువీర్ సిన్హాను తీసుకొచ్చి బిల్లాను కుళ్లబొడిపిస్తాడు. డబ్బుంటే చాలా మందికి ప్రేమ, ఇష్టం. కానీ బిల్లాకు మాత్రం కసి. ఆ డబ్బే అతని జీవితాన్ని నులిమేసింది. కాందిశీకునిగా బతికేలా చేసింది. నిజాయితీగా సంపాదిస్తే తను అనుకొన్న లక్ష్యాన్ని చేరుకోలేనన్న విషయం అర్థం చేసుకొంటాడు. హైదరాబాద్‌లో సత్యారెడ్డికి తొలుత చేపల్లో వజ్రాలు సరఫరా చేస్తాడు. కణ్ణన్(మనోజ్ కె.జయన్) అనే హెరాయిన్ స్మగ్లర్ ద్వారా గోవాలోని పెద్ద స్మగ్లర్ అబ్బాసీ(సుధాన్షుపాండే)ను కలుస్తాడు. అంతర్జాతీయ ఆయుధ స్మగ్లర్ డిమిత్రీ(విద్యుత్)కు సాయంచేసి అతనుండే బరోవియా వెళ్తాడు. అతనితో 500 కోట్ల రూపాయల మారణాయుధాల డీల్ కుదుర్చుకోవడం అబ్బాసీకి నచ్చదు. అతను డేవిడ్ బిల్లాను చంపబోగా తప్పించుకొని అబ్బాసీని చంపేస్తాడు. హైదరాబాద్‌లో ఉండే బిల్లా అక్క కుమార్తె జాస్మిన్(ఓమన్ కుట్టన్)ను అడ్డుపెట్టుకొని గోవా మంత్రి ప్రవీణ్‌కుమార్ బిల్లాను ఇబ్బంది పెట్టాలని చూస్తాడు. అతనితోపాటు బిల్లాను అవమానకరంగా మాట్లాడే గోవా ముఖ్యమంత్రిని సైతం బిల్లా చంపేస్తాడు. అబ్బాసీ గర్ల్‌ఫ్రెండ్ సమీర(బ్రూనా అబ్దుల్లా) బిల్లాతో సహజీవనం చేస్తూ అతని రహస్యాలను అంతర్జాతీయ స్మగ్లర్ డిమిత్రీకి చేరవేస్తుండడంతో ఆమెను చంపేస్తాడు. మొత్తానికి మాఫియా నాయకుడిగా ఎదిగే బిల్లా ఏ డబ్బు తన జీవితాన్ని శాసించిందో, ఆ డబ్బునే శాసించే స్థాయికి చేరుకొంటాడు. ఈ అనంత ప్రయాణంలో అతనికి రంజిత్ అనే మిత్రుడు మాత్రమే మిగులుతాడు. ఇంకా తాను చేరుకోవాల్సిన లక్ష్యం ముందున్నదని రంజిత్‌తో చెప్పి బిల్లా స్వంత విమానం ఎక్కడంతో డేవిడ్ బిల్లా నేర ప్రస్థానానికి తాత్కాలికంగా తెరపడుతుంది. ఈ చిత్రానికి మరో సీక్వెల్ వచ్చినా ఆశ్చర్యపడనక్కర లేదు. డేవిడ్ బిల్లాగా అజిత్‌తోపాటు అంతర్జాతీయ ఆయుధ వ్యాపారిగా నటించిన నటుడు విద్యుత్ అద్భుత నటన ప్రదర్శించాడు.

# అభివృద్ధి పనుల్లో అవినీతి పగుళ్లు!

**నెల్లూరులో పనులు జరుగుతున్నాయిలా!**



బద్దలుగా పగిలిపోయిన సిమెంటు రోడ్డు.

కోట్లాది రూపాయలతో నగరంలో చేపట్టిన అభివృద్ధి పనుల్లో నాణ్యత కొరవడుతుంది. కాంట్రాక్టర్లు కాసులకు కక్కుర్తిపడి నాసిరకంగా నిర్మాణాలు జరిపిస్తుండడంతో రోడ్లు, కల్వర్టులు కొద్ది రోజులకే దెబ్బతినిపోతున్నాయి. రోడ్లు పగుళ్లిచ్చి అవినీతికి సాక్షీభూతంగా కన్పిస్తున్నాయి. కోట్లాది రూపాయలతో నిర్మితమమవుతున్న రోడ్లు దశాబ్దకాలం చెక్కుచెదర కుండా వుండాల్సి వున్నప్పటికీ అదెక్కడా కన్పించడం లేదు. కాంట్రాక్టర్ల అవినీతి, అధికారుల లంచాల కక్కుర్తి వెరసి వేసిన మూణ్నాళ్లకే ధ్వంసమై రూపురేఖలు కోల్పోతున్నాయి. నగరంలో గడచిన పదేళ్ల కాలంలో 100 కోట్ల రూపాయల మేర అభివృద్ధి పనులు జరిగాయి. తుఫాన్‌లకు సంబంధించిన విడుదలైన నిధులు, శాసన సభ్యుల నిధులతో నగరంలో ప్రధానరోడ్లు, లింకురోడ్లు, కల్వర్టులు, తాగునీటి పైపులైన్ పనులు జరిగాయి. ప్రజాప్రతినిధుల అనుచరులే కాంట్రాక్టర్లుగా, బినామీలుగా మారి పనులు చేపడుతున్నారు. నాణ్యతకు తిలోదకాలివ్వడంతో కొద్దిరోజులకే రూపురేఖలు మారిపోతున్నాయి. దీంతో నగరంలోని పలు ప్రాంతాలలో నిర్మించిన సిమెంటు రోడ్లు పగుళ్లిచ్చి వున్నాయి. బాలాజీనగర్, సరస్వతినగర్ చిల్డ్రన్స్‌పార్కు, వేదాయపాళెం, బివినగర్ తదితర ప్రాంతాలలో ఇలాంటి రోడ్లు దర్శనమిస్తున్నాయి. ఈ పగుళ్లకు తారుపూసి మాయచేసి వున్నారు. చివరకు కార్పొరేషన్ కార్యాలయానికి నిర్మించినరోడ్డు ప్రారంభానికి ముందే లేచిపోయింది. ఇలాంటివి కోకొల్లలు. బద్దలుగా పగిలిపోయిన రోడ్లు పలు ప్రాంతాలలో ప్రమాదాలకు కారణం అవుతున్నాయి. ఇంత జరుగుతున్నా జంట శాసనసభ్యులు ఉత్తుత్తి తనిఖీలు చేసి ఫోటోలకు ఫోజులివ్వడం తప్ప ప్రజల బాగోగులు పట్టించుకోకపోవడంతో వేసిన మూణ్ణాళ్లకే ముదనష్టంగా మారుతున్నాయి రోడ్లు.

# ట్రాఫిక్ నియంత్రించను రంగంలోకి దిగిన ఎస్పీ!

● సఫలీకృతులవ్వాలని కోరుకొందాం.



ట్రాఫిక్ సిఐ బొట్టు వెంకటేశ్వర్లుకు సూచనలిస్తున్న ఎస్పీ.

నగరంలో అస్తవ్యస్తంగా వున్న ట్రాఫిక్‌ను నియంత్రించేందుకు ప్రతి ఒక్కరి సహకారం అవసరమని జిల్లా ఎస్పీ బి.వి.రమణకుమార్ తెలిపారు. గందరగోళంగా వున్న ట్రాఫిక్ చక్కదిద్దేందుకు నగరంలో పలు ప్రాంతాలకు వెళ్లి వాటి స్థితిగతులను పరిశీలించారు. దీనిపై స్థానిక ఉమేష్‌చంద్ర సమావేశ మందిరంలో సమావేశం నిర్వహించారు. రోజు రోజుకు అధికమౌతున్న ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేందుకు చర్యలు చేపడుతున్నామన్నారు. వివిధ దుకాణాల వద్దకొచ్చేవారు వాహనాలను షాపుల ముందు నిలుపుతుండడంతో సమస్యలు తలెత్తుతున్నాయన్నారు. దీనికి సంబంధించి పలువురు వ్యాపారులకు నోటీసులు జారీ చేశామన్నారు. షాపుల యాజమాన్యం ట్రాఫిక్ నియంత్రణకు సహకరించాలన్నారు. వాహనాలు అధికం కావడం మరో కారణమన్నారు. రోడ్డును ఆక్రమించుకొంటుండడం, వాహనాల రద్దీతో ట్రాఫిక్‌కు అంతరాయం ఏర్పడుతుందన్నారు. ఆక్రమణలను తొలగించేందుకు మునిసిపల్ అధికారులతో మాట్లాడామన్నారు. టౌన్‌బస్సులు ఎక్కడపడితే అక్కడ ఆపడం, ఆటోలు అధికం కావడమూ ట్రాఫిక్ ఇబ్బందులు తలెత్తేందుకు కారణంగా చెప్పారు. నగరంలో 12వేల ఆటోలు తిరుగుతుంటే అందులో 2వేల మందికి పైగా లైసెన్సులు లేవని తెలిపారు. బస్సు డ్రైవర్లకు లైసెన్సులు లేవని వీటన్నింటిపై దృష్టి సారించనున్నట్లు చెప్పారు. మద్రాసు బస్టాండ్ వద్దకు వచ్చే వారు తమ వాహనాలను కోనేరు వద్ద, ఆర్టీసి బస్టాండ్ వద్ద నిలిపే వాహనాలను సర్వోదయ కళాశాలలో నిలిపేలా చర్యలు చేపడుతున్నామన్నారు. చట్టవ్యతిరేక కార్యకలాపాలు, శాంతిభద్రతలకు విఘాతం కల్గించే వారిని గుర్తించి 1098కు సమాచారం అందించాలని, నగరంలో దొంగతనాలకు కారణమైన వారిని పట్టుకొన్న పోలీసు సిబ్బందిని ఆయన అభినందించారు.

# పోలీస్ క్వార్టర్లకు రిపేర్లు చేయరూ!



దుస్థితిలో మూలపేట పోలీస్ క్వార్టర్స్.

జిల్లాలో పోలీసు క్వార్టర్ల ఈ ఆర్థిక సంవత్సరంలో కూడా రిపేర్లకు నోచుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఎన్నో సంవత్సరాల నుంచి పోలీసు క్వార్టర్లు మరమ్మత్తులకు నోచుకోక శిథిలావస్థకు చేరుకొని వున్నాయి. వీటికి రిపేర్లు చేసి వినియోగంలోకి తీసుకురావాలని పోలీసు శాఖ నిర్ణయించి పోలీసు హౌసింగ్ కార్పొరేషన్‌కు ప్రతిపాదనలు పంపింది. రాష్ట్రప్రభుత్వం తొలుత క్వార్టర్ల రిపేర్లకు అంగీకరించినప్పటికి ఆ తర్వాత నిధులు విడుదల చేయడంలో తీవ్ర జాప్యం చేసింది. దీంతో క్వార్టర్ల రిపేర్ల ప్రతిపాదనలు ప్రక్కన పడిపోయాయి. ఇటీవల హడ్కో ఇందుకు అవసరమైన నిధులను సమకూర్చేందుకు ముందుకు వచ్చింది అయితే నిధులు మంజూరుకు రాష్ట్ర ప్రభుత్వం గ్యారంటీ ఇవ్వాలని షరతుపెట్టింది. హడ్కో మంజూరు చేసే రుణానికి నిబంధనల ప్రకారం ప్రభుత్వం గ్యారంటీ ఇవ్వాల్సి వుంటుంది. అయితే ప్రభుత్వం గ్యారంటీ ఇచ్చేందుకు ముందుకు రాక పోవడంతో రుణం మంజూరు వెనక్కు వెళ్లింది. జిల్లావ్యాప్తంగా పోలీసు క్వార్టర్లు వినియోగంలో లేకపోవడంతో అద్దె ఇళ్లల్లో పోలీసులు జీవనం సాగిస్తున్నారు.

# ధార్మిక ప్రచారంతో తృప్తి!

**నెల్లూరులో సామవేదం షణ్ముఖశర్మ**

సినీరంగంలో ఎన్నో మధురమైన పాటలకు రచన చేసి ప్రఖ్యాత గీత రచయితగా వెలుగొందిన సామవేదం షణ్ముఖశర్మ తన పంథా మార్చుకొని ఆధ్యాత్మిక రంగంవైపు మళ్లి చక్కని వాగ్ధాటితో ప్రవచనకర్తగాను పేరు గడించాడు. సినీహీరో మోహన్‌బాబు ద్వారా పెదరాయుడుతో సినీరంగానికి పరిచయమైన ఆయన ప్రస్తుతం ఎక్కడ చూసినా ఆధ్యాత్మికతను బోధిస్తూ భక్తి కుసుమాలను విరజిల్లుతున్నాడు. నగరానికి చెందిన కంటి వైద్యనిపుణుడు డాక్టర్ శివప్రతాప్‌రెడ్డి సహకారంతో సుందరకాండ అంతరార్థాలు అనే అంశంపై టౌన్‌హాలులో ఆధ్యాత్మిక ప్రసంగం చేసేందుకు నగరానికి విచ్చేసిన ఆయన తన సినీరంగ ప్రవేశం, ఆధ్యాత్మిక ప్రవచనాలపై ముచ్చటించారు.



ఆధ్మాతిక ఉపన్యాసం చేస్తున్న సామవేదం షణ్ముఖశర్మ.

అమ్మానాన్నల ప్రభావంతో చిన్ననాటి నుంచే సంస్కృత ఆంధ్రభాషలపై మంచిపట్టు లభించింది. ఎకనామిక్స్‌లో డిగ్రీచేసి స్వాతి మ్యాగజైన్‌లో సబ్ ఎడిటర్‌గా ఉద్యోగ ప్రస్థానం ప్రారంభించాను. మోహన్‌బాబు తదితరుల పరిచయంతో పెదరాయుడు సినిమా ద్వారా సినీ రచయితగా పరిచయం అయ్యాను. ఆనాటి నుంచి స్వల్పకాలంలోనే 150కు పైగా చిత్రాలకు పాటలు వ్రాసే అవకాశం లభించింది. ఆర్థికంగా ఉన్నతిని సాధించినా ఏదో వెలితి వుండేది. తల్లిదండ్రుల ఆశయం మేరకు ఆధ్యాత్మికతవైపు దృష్టి సారించాను. ప్రవచనాలను చేయడం ప్రారంభించాను. సినీరంగంలో పాటల రచయితగా ఎంత పేరు లభించిందో, అంతకంటే ఎక్కువ ఖ్యాతి లభించింది ఆధ్యాత్మిక రంగంలో. ఎందరో దర్శకులు తిరిగి పాటలు వ్రాయమని పిలిచినా సున్నితంగా తిరస్కరించాను. కానీ కళాతపస్వి కె.విశ్వనాథ్ కోరిక మేరకు గీతాలను అందించాను. ఇకపై గీత రచన సినిమాలకు చేయనట్లేనన్నారు. దేశంలో ఆధ్యాత్మిక తను బోధించిన ఆదిశంకరులు, స్వామి వివేకానంద యువకులుగా వుండగానే ఆ మార్గంలో పయనించారు. వారు చూపిన దారిలో నడవాలన్నదే నా కోరిక. ధార్మిక ప్రచారం తపస్సు. అందులోనే తృప్తిని పొందుతున్నాను. నెల్లూరు ప్రజలు ఎంతో సహృదయులు. చాలాకాలం తర్వాత తిరిగి శ్రీరాముడు, సీత, హనుమంతులకు సంబంధించిన సుందరకాండ అంతరార్థాలను తెలియజేస్తూ ఆధ్యాత్మిక ప్రవచనాలు చేయడం సంతోషంగా వుందన్నారు.

# మూడు పంటలకు బీమా పథకం

## చేయించుకోవడం ఉత్తమం

ఈ ఖరీఫ్ సీజన్‌లో మరో మూడు పంటలకు బీమా పథకం వర్తించనుంది. ఈ మేరకు జాతీయ వ్యవసాయ శాఖ పంటల బీమా పథకం నిర్ణయించింది. జిల్లాలో ఖరీఫ్ సీజన్‌లో వేసే సజ్జ, వేరుశనగ, చెరుకు పంటలకు నష్టం వాటిల్లితే బీమా చెల్లిస్తారు. గ్రామాన్ని ఒక యూనిట్‌గా తీసుకొని పథకం అమలు చేస్తారు. బ్యాంకుల నుంచి రుణాలు పొందని రైతులు, కౌలు రైతులు, ఇతర రైతు సంఘాలు నిర్ణీత దరఖాస్తు ఫారాన్ని పూర్తిచేసి నిర్ణయించిన ప్రీమియాన్ని బ్యాంకు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా ఈ నెల 31లోగా వ్యవసాయ, ఉద్యానవనశాఖ అధికారులకందించి బీమా పథకంలో చేరవచ్చు. వివిధ బ్యాంకుల నుండి రుణాలు పొందే రైతులకు ఈ బీమా సౌకర్యం ఈ యేడాది ఏప్రిల్ 1 నుంచి సెప్టెంబర్ 30 వరకు, వార్షిక పంటలకు అక్టోబర్ 31 నుంచి నవంబర్ 30 వరకు ఈ పథకం వర్తిస్తుందని వ్యవసాయశాఖ అధికారులు తెలియజేశారు.

## రాజకీయం సమాప్తం

మొదటి పేజీ కొరవ

రాజీ వల్ల జగన్‌కు కలిగే ఉపకారం జైలు జీవితం నుంచి విముక్తి. రాంజెఠ్మలానీ వంటి ఉద్దండ న్యాయ నిపుణులను పక్కన పెట్టుకొని వున్న జగన్, అంత చిన్న ప్రయోజనం కోసం తన రాజకీయ జీవితం మొత్తాన్ని త్యాగం చేసుకొంటాడా? అంత వెర్రివాడా? ఒకవేళ రాజీ షరతులలో భాగంగా కాంగ్రెస్ అధినాయకత్వం సిబిఐ ముక్కుతాడు వేసినా, న్యాయస్థానాలు వూరకుంటాయా? అప్పుడు రెండింటికి చెడిన రేవడి అవుతానన్న నిజం ఆయనకు తెలియదా?

ఏ రకంగా చూసినా రాజీ వల్ల జగన్‌కు నష్టమే తప్ప లాభం లేదు. తాత్కాలికంగా బెయిల్ దొరికి జైలు నుంచి బయటపడ వచ్చు కానీ, కేసుల వూబి నుంచి బయటపడడం మాత్రం జరగని పని. ఆ దశ ఎప్పుడో దాటి పోయింది. పైపెచ్చు జగన్‌కు ప్రజాదరణ కలగడానికి కారణం – ఆయన పోరాట యోధుడన్న అభిమానం మాత్రమే. స్వంత అవసరాల కోసం ప్రజాభిమానాన్ని తాకట్టు పెట్టే స్వార్థపరుడని అర్థమైతే, నీరాజనాలు పలికిన జనమే నడివీధిలో నిలేస్తారు. అది ఆత్మహత్యతో సమానం.

ఏది ఏమైనా కాంగ్రెస్, జగన్‌ల మధ్య ఏదో జరగరానిది జరుగుతున్నదన్న అనుమానాలు జనంలో వ్యాప్తి అవుతున్నాయి. వాటిని నివృత్తి చేయవలసిన జగన్ పార్టీ నేతలు మరింత అనుమానాలు కలిగేట్లు మాట్లాడుతున్నారు. దీనివల్ల అంతిమంగా నష్టపోయేది జగన్ మాత్రమే. కాంగ్రెస్‌కు వచ్చిన నష్టం ఏమీ లేదు. 2014 ఎన్నికలు రాష్ట్రంలో కాంగ్రెస్ పూర్తిస్థాయి పతనానికి నాంది అనుకొంటున్న సమయంలోతాను రాజకీయ ఆత్మహుతికి పాల్పడి, కాంగ్రెస్‌కు పునరుజ్జీవం కల్పించే వెర్రి పని జగన్ చేయబోడని ఆయన్ను నమ్ముకొని వున్న లక్షలాది మంది వైఎస్ఆర్ కాంగ్రెస్ కార్యకర్తల విశ్వాసం.

## కులం తోకతో ఈదుతారట!

8వ పేజీ కొరవ

టంగా తమలో ఇమడ్చుకోవాలన్నది రెండవ ప్రతిపాదన. ఆంధ్ర ప్రాంతంలో సంఖ్యరీత్యా కాపు వర్గానికి చాలా ఆధిక్యత ఉంది. ఆర్థికంగా కూడా వారు స్థితిపరుల క్రిందే లెక్క. సామాజికంగా తతిమా అగ్ర వర్ణాలను ఢీకొనే శక్తి ఉంది.

కాంగ్రెస్ పార్టీ చేస్తున్న ఈ ప్రయత్నాలను పసిగట్టిన చంద్రబాబు బిసి కుల నినాదం తలకెత్తుకున్నాడు. వచ్చే ఎన్నికలలో వారికి 100 సీట్లిస్తానని ప్రకటించాడు. నిజానికి ఎన్టీఆర్ హయాం నుంచి బిసిలు తెలుగుదేశం పార్టీకి సన్నిహితులు. ఇటీవలి కాలంలో వారిలో ఆ అభిమానం కరిగిపోయింది. దాన్ని తిరిగి పుట్టించడానికి 100 సీట్ల మంత్రం పని చేస్తుందని బాబు ఆశ పడుతున్నాడు. రాజకీయాలలో కులం ప్రస్తావన, ప్రమేయం అనాది నుంచే ఉన్నాయి. కానీ కాంగ్రెస్‌వంటి జాతీయ పార్టీ ఒక కులానికి ప్రాతినిధ్యం వహించే స్థాయికి ఇవి ముదిరిపోవడం బాధాకరమైన పరిణామం.

## తెలిసేదెప్పుడు!

8వ పేజీ కొరవ

ధ్యం. పూర్తిగా జవసత్వాలుడిగిన స్థితిలో వున్న పార్టీకి పునరుజ్జీవం కల్పించాలంటే ముమ్మరమైన ప్రజా ఉద్యమాలతోనే సాధ్యం. జగన్‌ను వదలి పెట్టి, ప్రతిపక్షంగా ప్రభుత్వం మీద ముప్పేట దాడి జరపడం అవసరం. ఆ దాడి పత్రికా ప్రకటనలకు పరిమితం కాకూడదు. ప్రజల మనస్సులు గెలుచుకొనే తీరులో వుండాలి. అంత సామర్థ్యం ఆ పార్టీలో మిగిలి వుందా అన్నది సందేహం.

### బాలకృష్ణ నిలబడ గలరా?

పార్టీ దీనావస్థ చూసి ఆవేదన చెందిన బాలకృష్ణ తాను నడుం బిగిస్తానని ముందుకు వచ్చాడు. కానీ ఆయన తత్వం తెలిసినవారు, కడదాకా ఆయనలో ఆ పట్టుదల వుంటుందంటే నమ్మలేరు. అటువంటి బాధ్యత భుజానికెత్తుకోగల్గిన ఓపిక వున్నవాడు జూనియర్ ఎన్టీఆర్ ఒక్కడే. అయితే ఏ కారణం వల్లనో ఆయన, ఆయన తండ్రి హరికృష్ణ పార్టీకి దూరంగా వున్నారు. పార్టీకి ద్రోహం చేసే ఆలోచనలు వారికి లేకపోయినా, పార్టీకి బ్రతుకు కల్పించే బాధ్యత తీసుకొంటారా అన్నది అనుమానం. కుటుంబపరమైన ఈ అంతఃకలహాలు కూడా తెలుగుదేశం పార్టీని ఇబ్బంది పెడుతున్నాయి. ముందుగా వాటిని సర్దుబాటు చేసుకోవడం అవసరం.

రాష్ట్ర రాజకీయాలలో తెలుగుదేశం పార్టీకి చరిత్రాత్మకమైన స్థానం వుంది. మూడు దశాబ్దాల పాటు దేశ రాజకీయాలను ప్రభావితం చేసిన పార్టీ అది. చిన్న చిన్న తప్పులతో ఆ చరిత్రను పాతర వేసుకోవడం రాజకీయ అవివేకమౌతుంది. తన పార్టీ పతనానికి తన తప్పులే కారణమనే నిజాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించే హృదయ వైశాలయం చంద్రబాబులో కలిగితేనే దానికి పునర్జన్మ.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

పురుగులు అధిక సంఖ్యలో వచ్చి వాలుతుండడంతో ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. శరీరంపై ఈ పురుగులు వాలిన చోట ఎర్రగా మారి, దద్దుర్లు వస్తుండడంతో స్థానికులు చెప్పలేని బాధ అనుభవిస్తున్నారు. గోడౌన్ల నుంచి కొంత కాలంగా ఇలాంటి పురుగులు వస్తున్నాయని, వీటి కారణంగా పలు సమస్యలు ఎదుర్కొంటున్నామని వాపోతున్నారు స్థానికులు.

### బంగారం కోసమే హత్య

అల్లూరుకు చెందిన తిరివీధి లక్ష్మీనారాయణ రూరల్ మండలం కొరివివారి కండ్రిగలో హత్యగావింపబడిన ఘటనపై పోలీసులు విచారణ జరిపి హంతకులను పట్టుకొన్నారు. దీనిపై ఎస్పీ రమణకుమార్ వివరాలను తెలియజేశారు. అతని వద్ద ఉన్న బంగారం కోసమే ఆయనతో సన్నిహితంగా ఉండే వాళ్లే నమ్మించి ఈ ప్రాంతానికి తీసుకొని వచ్చి హత్య చేశారని తెలిపారు. అలాగే తిప్పరాజువారి వీధిలో గుడ్డల షాపు గుమస్తా నుంచి నగదు దోచుకొన్న నిందితులనూ అరెస్టు చేసినట్లు ఎస్పీ తెలిపారు.

### మాకు ఎన్నికల విధులు వద్దు

ఎన్నికల విధుల నుంచి తమను తప్పించాలంటూ బిఎల్ఓలుగా వ్యవహరిస్తున్న అంగన్‌వాడీ వర్కర్లు కలెక్టరేట్ ఎదుట జులై 16న ధర్నాకు దిగారు. అదనపు బాధ్యతలు అప్పజెప్పడం వలన అసలు విధులు నిర్వర్తించలేకపోతున్నామని, అంగన్‌వాడీ లక్ష్యాలను చేరుకోలేక పోతున్నామన్నారు. దీనికితోడు బిఎల్ఓలుగా ఎవరు పట్టించుకోవడం లేదని నెలల తరబడి తమకు రావాల్సిన మొత్తాలు చెల్లించలేదన్నారు. ఇకపై తమను ఆ బాధ్యతల నుంచి తప్పించాలని కోరారు.



విక్రమ సింహపురి యూనివర్సిటీ ప్రకటించిన డిగ్రీ ప్రథమ సంవత్సరం ఫలితాల్లో ఫస్ట్ ర్యాంకర్‌గా నిలచిన నెల్లూరు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఉమెన్స్ అకాడమీ బికాం విద్యార్థిని షేక్. అమీనాను అభినందిస్తున్న యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ జి.రాజారామిరెడ్డి, రిజిస్ట్రార్ వి.నారాయణరెడ్డి. ప్రక్కన అకాడమీ కరస్పాండెంట్ జెవి.రెడ్డి తదితరులున్నారు.

## ఎమ్మార్పీలు వెనక్కు!

జిల్లా విద్యాశాఖలో ఉపాధ్యాయులుగా నియమితులై ప్రస్తుతం మండల రీసోర్సు పర్సన్లుగా విధులు నిర్వహిస్తున్నవారిని వెనక్కు పిలవాలని విద్యాశాఖ నిర్ణయించింది. పాఠశాలలో ఉపాధ్యాయుల కొరత ఏర్పడిన కారణంగా ప్రభుత్వం ఈ మేరకు నిర్ణయం తీసుకొంది. జిల్లాలోని 46 మండలాల్లో దాదాపు వందమంది ఉపాధ్యాయులు ఎమ్మార్పీలుగా పని చేస్తున్నారు. వీరందరూ త్వరలో గతంలో పని చేస్తున్న మండలాల్లో తిరిగి విధుల్లో చేరాల్సి వుంటుంది. ఎమ్మార్పీల కారణంగా విద్యాశాఖకు ఎటువంటి ప్రయోజనం చేకూరడం లేదు. కేవలం మండల విద్యాశాఖాధికారికి అనుకూలంగా పైరవీలు చేసేందుకే పరిమితమైపోయారన్న ఆరోపణలు వున్నాయి. మండలస్థాయి నుంచి రాష్ట్రస్థాయి వరకు ఎమ్మార్పీల పనితీరుపై గత సంవత్సరం నుంచి విద్యాశాఖ చర్చలు జరిపింది. ఎమ్మార్పీలను ఉపాధ్యాయులుగా కొనసాగించి వీరి స్థానంలో కొత్తగా నియామకాలు చేపట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఔట్‌సోర్సింగ్ విధానం ద్వారా అర్హులైన వారిని ఎమ్మార్పీలుగా తీసుకోవాలని ప్రభుత్వానికి విద్యాశాఖ ప్రతిపాదనలు పంపనుంది. విద్యాశాఖ నిర్ణయాన్ని ఉపాధ్యాయ సంఘాలు వ్యతిరేకిస్తున్నాయి.

## నూతన కార్యవర్గం

కావలి రోటరీక్లబ్‌కు నూతన కార్యవర్గం ఎన్నికైంది. స్థానిక ఆర్ఎస్ఆర్ కళ్యాణ మండపంలో జరిగిన ఎన్నికల్లో సభ్యులు నూతన కమిటీని ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా బి.అయ్యలరెడ్డి, కార్యదర్శిగా కె.బ్రహ్మానందం, ఉపాధ్యక్షుడిగా కె.గోపీకృష్ణ ఎన్నికయ్యారు. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో దొడ్ల వరదారెడ్డి, భరత్ కుమార్‌రెడ్డి, రాఘవేంద్రశెట్టి, సుధాకర్‌రెడ్డి, శ్రీనివాసులరెడ్డి, ఎం.సుబ్బారెడ్డి, మధుసూధన్‌రెడ్డి, వీరాస్వామి పాల్గొన్నారు.

## విద్యుత్ కటకట

16వ పేజీ కొరవ

కొని వస్తున్న కరవు పరిస్థితులు, గ్యాస్ కొరత, బొగ్గు ఖరీదు వంటివన్నీ కలిసి రాష్ట్రంలో విద్యుత్ రంగాన్ని నలిపి నాశనం చేసి పారేశాయి. రాత్రికి రాత్రి ఈ సమస్యలకు పరిష్కారం దొరకడం అసాధ్యం. ఎంతో చిత్తశుద్ధితో ప్రయత్నం చేసినా మొత్తం సమస్య పరిష్కారానికి కనీసం పదేళ్ల సమయం పడుతుంది. అందుకు ప్రయత్నంతో పాటు లక్షలాది కోట్ల రూపాయల పెట్టుబడి కూడా కావాలి.

విద్యుత్ అవసరాలకు తగిన స్థాయిలో ఉత్పత్తి కర్మాగారాలు నెలకొల్పడం, నీటి ఆధారిత విద్యుత్ మీద ఆధారపడడాన్ని తగ్గించుకోవడం, సౌర విద్యుత్, గాలి విద్యుత్‌లను ప్రోత్సహించడం, వ్యవసాయ వినియోగాన్ని నియంత్రించడం, ఉత్పత్తి ఖర్చుకు సరిపడా సహేతుకమైన ధరల విధానానికి ప్రజలు ఆమోదం తెలిపేటట్లుగా చైతన్యం పెంచడం వంటి చర్యలు చేపడితే తప్ప రాష్ట్రంలో విద్యుత్ కొరత తీరదు. ప్రజల కష్టాలు గట్టెక్కవు. అందుకు ఎన్నేళ్లు పడుతుందో పరమాత్ముడికెరుక. అంత వరకు ఈ చీకటి కష్టాలు తప్పవు.

## జనవాణి

2వ పేజీ కొరవ

సౌర, పవన విద్యుత్ ఉత్పత్తులపై దృష్టి నిలపాలి. ఇవి రెండూ మన రాష్ట్రంలో బాగా ఉత్పత్తి అవుతాయి. వీటిపై ప్రభుత్వం దృష్టి నిలిపితే పెచ్చు పెరిగిన విద్యుత్ కోతలు తప్పుతాయి.

సి.హెచ్.సురేష్‌బాబు నెల్లూరు

## విద్యుత్ కోత లేకుండా చూడండి!

ఆగష్టు 2, 3 తేదీల్లో నెల్లూరులో కొన్ని వందల పెళ్లిళ్లు జరుగనున్నాయి. విద్యుత్ శాఖ ఆ రోజు ప్రజలపై దయచూపి విద్యుత్ కోత లేకుండా చూస్తే జనం సంతోషిస్తారు.

ఎస్వీఎస్ కోటేశ్వరరావు నెల్లూరు

## పదరంగం -25

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | 2 | | 3 | 4 | | 5 |
| | | | | 6 | | | 7 | | 8 | |
| 9 | | | | | 10 | 11 | | | 12 | |
| | | | | 13 | | | | | | |
| 14 | | 15 | | | | | | | 16 | 17 |
| | | | | 18 | | | | | | |
| | 19 | | | | | | | | 20 | |
| 21 | | | 22 | | | 23 | 24 | | | |
| 25 | | 26 | | | | 27 | | | | |
| | | | | 28 | | | | | | 29 |
| 30 | | | | | | 31 | | | | |

**అడ్డం**

1. యూరి... అంతరిక్ష యాత్రికుడు (4)
3. తమిళంలో అవును (2)
6. దేవుని సేవ (2)
7. చలువ లేపనం (4)
9. అమెరికా జలపాతం (4)
10. రాముడిని పిలవండి (2)
12. $90^{0}$ కోణం (2)
13. గెలిస్తే పాడే పాట (5)
14. అలనాటి అందాల నటి (పూలతీగ) (4)
16. ముందున్న కాలం (2)
18. సురేంద్రుని పురం (5)
19. గ్రద్ధ (2)
20. పరిపాలన గల ప్రాంతం (2)
21. త్రవ్వే సాధనం (2)
22. పాచి పట్టిన బండలు (5)
25. సన్యాసి, మోక్షకామి (4)
27. బాగా మొండి తనం గలవాడు (4)
28. తూర్పుగోదావరి జిల్లా పట్టణం (4)
30. గతించిన కాలం (3)
31. శ్రీరాముని ట్విన్స్ (5)

**నిలువు**

1. అందరానిది (6)
2. నన్నయ ఆశ్రయదాత (8)
3. ఆజ్ఞ (3)
4. తల్లి సోదరుడు (2)
5. పిరుదు (3)
8. బ్లూ కలర్ (2)
11. భ్రాంతి (2)
15. ఒక సుగంధ ద్రవ్యం (3)
17. పరాయి దేశం (3)
19. గార్ధభం (3)
20. రాజుగారి లోగిలి (3)
21. సర్ప వైరం (4)
22. నాలుగో వంతు (2)
23. అలనాటి మేటి విలన్ (4)
24. క్రింద నుంచి మంచురాళ్ళు (4)
26. నీచము (3)
28. కామితము గలవాడు (2)
29. క్షీరము (2)

**సమాధానాలు**

## పదరంగం -24

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 సం | 2 క | ల్ప | సి | 3 ద్ధి | | 4 క | | 5 త | రు | 6 ణం |
| 7 క | ల | | | బు | | జ | | రా | | ర |
| 8 ట | ము | 9 కు | | ద్ధి | | 10 రా | రా | జు | | చ |
| ము | | మా | | 11 సి | 12 నా | రే | | | 13 మ | |
| | | ర | | | స్తి | | | 14 సూ | రీ | డు |
| | 15 ఆ | స్వా | ద | 16 న | | | | 17 దం | చి | |
| 18 బా | దా | మి | | ల్లి | | 19 సు | | 20 టు | క | 21 ఇ |
| | యం | | 22 ఏ | | 23 స | ర | ఫ | రా | | ర |
| 24 సా | | 25 ప | రు | వ | ము | | | 26 యి | స్రా | వై |
| 27 కా | మి | | వా | | ద్రం | | 28 స | | | |
| రం | | 29 పో | క | లు | | 30 వి | శ్వా | మి | త్రు | డు |

# సంక్షిప్త సింహపురి

## పోలీసుల వినతి

దరిదాపులు జిల్లాలోని పోలీసు క్వార్టర్స్ దుస్థితిలోనే ఉన్నాయి. ఇదే విషయాన్ని నెల్లూరు వచ్చిన రాష్ట్ర పోలీస్ గృహ నిర్మాణ సంస్థ మేనేజింగ్ డైరక్టర్, ఐపిఎస్ అధికారి మదన్‌లాల్ దృష్టికి ఎపి పోలీస్ ఆఫీసర్స్ అసోసియేషన్ జిల్లా కమిటీ తీసుకెళ్లింది. నెల్లూరులో పోలీస్ డార్మెట్రీ నిర్మాణ పనులు వెంటనే చేపట్టాలని, పోలీసు శాఖ నిధులతోనే పోలీస్ కళ్యాణ మండపాన్ని నిర్మించాలని కోరారు. మదన్‌లాల్ స్పందిస్తూ సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానన్నారు. మదన్‌లాల్‌ను కలసిన వారిలో పోలీస్ ఆఫీసర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు మాధవరెడ్డి, గౌరవాధ్యక్షుడు వై.శ్రీహరి, కోశాధికారి ఎం.ప్రసాదరావు, బి.శివప్రకాష్, టి.వెంకటేశ్వర్లు, లక్ష్మీపతి ఉన్నారు.

## బ్రాహ్మణ మహాసభ వితరణ

నెల్లూరు బ్రాహ్మణ మహాసభ నేతృత్వంలో కర్నాలమిట్ట పురపాలక ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు భోజనం ప్లేట్లు, గ్లాసులను పంపిణీ చేశారు. నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, కార్పొరేషన్ కమిషనర్ డాక్టర్ టిఎస్ఆర్ ఆంజనేయులు చేతులమీదుగా ఈ కార్యక్రమం జరిగింది. ప్లేట్లు, గ్లాసుల పంపిణీకి ఆర్.వెంకట్రామన్ విరాళం అందించారు. మహాసభ నాయకులు డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్, రాళ్లపల్లి రామ సుబ్బారావు, ఎస్.వి.ఎల్.వరప్రసాద్, సుబ్బుశర్మ, రాధాకృష్ణమూర్తి, దేవి ప్రసాద్, వాసు, సురేష్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## నోటు పుస్తకాల పంపిణీ

ది నెల్లూరు ఆర్య వైశ్య బులియన్ మర్చంట్స్ అండ్ పాన్ బ్రోకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో రంగనాయకులపేటలోని కళ్యాణ మండపంలో 700 మంది విద్యార్థులకు ఒక్కొక్కరికి ఐదు నోటు పుస్త కాలు, ఒక పెన్ను, ఒక పెన్సిల్, ఎరేజర్, షార్ప్‌నర్‌ను పంపిణీ చేశారు. జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి చేతులమీదుగా ఈ కార్యక్రమం జరిగింది. అసోసియేషన్ నాయకులు అమరా మోహన్‌రావు, తులసి సుధాకర్‌రావు, కె.శోభన్‌బాబు, ఎమ్వీ ఆంజనేయులు, దగ్గుమాటి గోపీకృష్ణ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## వివేకానందరెడ్డి రాజీనామాకు డిమాండ్!

సమస్యలు తీర్చలేని వారికి అధికారం ఎందుకని, దీన్ని దృష్టిలో పెట్టుకొని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి రాజీనామా చేస్తే బాగుంటుందని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ రూరల్ నియోజకవర్గం ఇన్‌ఛార్జ్ కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి డిమాండ్ చేశారు. బుజబుజనెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ ప్రజా సమస్యలు చెప్పుకోవడానికి వివేకానందరెడ్డి దగ్గరకు వెళ్తే జైలులో ఉన్న జగన్మోహన్‌రెడ్డిని అడగండని వెటకారంగా మాట్లాడడం మంచి పద్ధతి కాదన్నారు. వైఎస్ కుటుంబాన్ని కనుమరుగు చేయాలనే కాంగ్రెస్, టిడిపిల ప్రయత్నాలను ప్రజలు ఓటు అనే ఆయుధంతో మొన్న జరిగిన ఉపఎన్నికల్లో బుద్ధి చెప్పారన్నారు. కరెంటు, నీళ్లలేక ప్రజలు ఇబ్బంది పడుతున్నారని వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో ప్రక్క రాష్ట్రాల నుంచి కరెంటుకొని ప్రజలకు అందించేవారన్నారు. ఈ కార్యక్రమంలో పిగిలం నరేష్, నగళ్ల రాము, బాదుల్లా, రాజగోపాల్, చలమయ్య, రాజు, అమీర్ తదితరులు పాల్గొన్నారు.

## తిరివీధి ప్రకాశరావు వితరణ




నెల్లూరీయుడు, ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ కోఆర్డినేటర్ తిరివీధి ప్రకాశరావు ఆర్యవైశ్య విద్యార్థుల ఉన్నత చదువుల కోసం రెండు లక్షల రూపాయల విరాళాన్ని అందించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో జరిగిన వాసవీ స్రవంతి రజతోత్సవాల వేడుకలో ప్రకాశరావును తమిళనాడు గవర్నర్ కొణిజేటి రోశయ్య సత్కరించారు. ప్రకాశరావు దొడ్డ మనసు మరికొందరికి అలవడుతుందన్న ఆశాభావాన్ని ఈ సందర్భంగా గవర్నర్ వ్యక్తం చేశారు.

## టీచర్లకు ప్రమోషన్ ఇవ్వండి!

ఉపాధ్యాయ బదలీల వల్ల అనేక హైస్కూళ్లలో సబ్జెక్టు టీచర్లు లేకుండా పోయారని దీనివల్ల విద్యార్థులకు తీవ్ర నష్టం జరుగుతుందని ఎమ్మెల్సీలు విఠపు బాలసుబ్రహ్మణ్యం, శ్రీనివాసులురెడ్డి ఒక ప్రకటనలో ఆవేదన వ్యక్తం చేశారు. ఇటీవల జరిగిన బదలీల వల్ల మారుమూల ప్రాంతాల్లో ఉపాధ్యాయుల కొరత తీవ్రంగా ఉందన్నారు. వెంటనే అర్హులైన సెకండరీ గ్రేడు టీచర్లకు, పండితులకు స్కూల్ అసిస్టెంట్లుగా ప్రమోషన్లు ఇవ్వడం ద్వారా ఈ సమస్యను పరిష్కరించవచ్చన్నారు. విద్యాశాఖ సంచాలకులు ఈ పోస్టుల భర్తీకి ఇచ్చిన ఆదేశాలను దృష్టిలో పెట్టుకొని నెల్లూరు డిఇఓ వెంటనే ప్రమోషన్ల ప్రక్రియ చేపట్టాలన్నారు. ప్రతినెలా వచ్చే ఖాళీలను కూడా ప్రమోషన్ల ద్వారా భర్తీచేసి హైస్కూళ్లలో విద్యా బోధన కుంటుపడకుండా చూడాలని ఎమ్మెల్సీలు విజ్ఞప్తి చేశారు.



రైతు లోకం

# పశువుల్లో జలగ వ్యాధులు!

పశువులకు సంక్రమించే నెత్తురు జలగ వ్యాధిని శాస్త్రీయంగా సెస్టోసామియోసన్ అంటారు. పరాన్న జీవులైన నెత్తురు జలగలు నత్తల ద్వారా వ్యాప్తిచెంది పశువుల రక్తనాళాల్లో ముఖ్యంగా సిరల్లో చేరి వ్యాధిని కలుగజేస్తాయి. పశువుల ముక్కు రంధ్రాల్లోని రక్తనాళాల్లో స్థిర నివాసం ఏర్పరచుకొని శ్వాసక్రియను ఆటంక పరుస్తాయి. సాధారణంగా తెల్లజాతి పశువులైన ఆవులు, ఎద్దుల్లో ఈ వ్యాధి ఎక్కువగా కనిపిస్తుంది.

**లక్షణాలు:** పశువు శ్వాస పీలుస్తున్నప్పుడు గురక వినిపిస్తుంది. వ్యాధిగ్రస్తమైన ఎద్దులు, దున్నలు సరిగా పని చేయలేవు. క్రమేపి బుసకొడుతున్నట్లు కష్టంగా శ్వాస తీసుకుంటాయి. ఒకసారి వ్యాధి బారిన పడితే పశువులు పూర్తి స్థాయిలో కోలుకోలేవు. ఈ వ్యాధి లక్షణాల తీవ్రతను చికిత్స ద్వారా తగ్గించవచ్చు.

**చికిత్స:** అంధియోమెలిన్ ఇంజక్షన్ 15 మిల్లీ లీటర్ల చొప్పున రోజు మార్చి రోజు నాలుగు ఇంజెక్షన్లను వేయించాలి. లేదా పశువైద్యుని సలహాపై ఆక్సిక్లోజనైడ్ మందును 100 కిలోల శరీర బరువుగల పశువుకు 30 మిల్లీలీటర్ల చొప్పున తాగించాలి. ఇలా వారానికి ఒకసారి చొప్పున మూడు వారాలు వాడాలి. టెప్రోలి లేదా లివోటాస్ వంటి లివర్ టానిక్‌ను కనీసం పది రోజులు వాడాలి.

### జీర్ణాశయ జలగ వ్యాధి:

జీర్ణాశయ జలగలు నత్తల ద్వారా వ్యాప్తి చెంది పశువుల అరల పొట్టలో చేరి వ్యాధిని కలుగజేస్తాయి. అన్ని రకాల పశువుల్లో ముఖ్యంగా వేసవికాలంలో, శీతాకాలం ప్రారంభంలో ఈ వ్యాధి సంక్రమిస్తుంది.

**లక్షణాలు:** వ్యాధిగ్రస్త పశువులు మేత మేయడం కష్టతరంగా వుంటుంది. పశువు దవడ భాగం క్రింద, ముందుకాళ్ల మధ్య భాగంలో నీరు చేరి వాపు కనిపిస్తుంది. రక్తహీనతతో పూర్తిగా నీరసిస్తాయి. వ్యాధి లక్షణాలు కనిపించిన 2-3 వారాల్లోపు చికిత్స అందించకపోతే పశువు చనిపోయే ప్రమాదం వుంటుంది.

**చికిత్స:** పేడ పరీక్ష ద్వారా వ్యాధిని నిర్ణయించిన తర్వాత పశువైద్యుని సలహా మేరకు డిస్టోడిన్ లేదా నియోజైడ్‌బోలస్‌ను 100 కిలోల పశువు శరీర బరువుకు ఒక గ్రాము మాత్రను వాడాల్సి వుంటుంది. పశువు త్వరగా కోలుకొనేందుకు లివర్ టానిక్‌లు, ఐరన్ టానిక్‌లు వాడాలి. నాణ్యమైన ఖనిజ లవణ మిశ్రమాన్ని రోజుకు 50 - 60 గ్రాముల చొప్పున వాడితే ఫలితం వుంటుంది.

**నివారణ:** జలగ వ్యాధులు వ్యాప్తికి ప్రధాన కారణమైన నత్తలను నివారించేందుకు మూడు నెలలకోసారి నీటి గుంటలు, చెరువుల అంచుల్లో ఒక శాతం మైలు తుత్తం ద్రావణం పిచికారి చేయాలి. అలాగే ప్రతి మూడు నెలలకోసారి జలగ వ్యాధుల నివారణకు మందులు వాడితే ఫలితం వుంటుంది.



Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14

# ఉత్పత్తికి, అవసరానికి మధ్య అంతరంలో విద్యుత్ కటకట!

- ఇంజనీర్ నార్ల తాతారావు హయాంలో రాష్ట్రంలో మిగులు విద్యుత్.
- 4వేల మెగావాట్లు నీటి ప్రాజెక్టుల ద్వారానే ఉత్పత్తి చేయాలి.
- ఉత్తుత్తి గ్యాస్ విద్యుత్.
- అధిక విద్యుత్ చార్జీల వసూళ్లలో దేశంలో ఆంధ్రానే ఫస్ట్.
- సమస్య పరిష్కారానికి పదేళ్లపైన పడుతుంది.

ఆధునిక మానవ ప్రగతికి జీవనది – విద్యుత్ సరఫరా. ఊపిరి పీల్చుకోకుండా ప్రాణి ఎట్లా బ్రతకలేదో, కరెంటు సరఫరా లేకుండా ప్రగతి చక్రం ఒక్క అంగుళం కూడా ముందుకు కదలలేదు. యాభైఏళ్ల క్రితమే ఈ వాస్తవం పాలకులకు, ప్రణాళికా రచయితలకు అర్థమైంది. కానీ దురదృష్టవశాత్తు అందుకు తగిన జాగ్రత్తలు పాటించడంలో మాత్రం మొత్తం వ్యవస్థ విఫలమైంది. దాని ఫలితమే ఇప్పుడు రాష్ట్రంలో ప్రజలెదుర్కొంటున్న దారుణమైన విద్యుత్ కోతల పరిస్థితి. అటు వ్యవసాయం, ఇటు పరిశ్రమల రంగాలు రెండూ ఈ కోతలతో కుదేలై పోతున్నాయి. రాష్ట్ర ఆర్థిక ప్రగతి తిరోగమనం వైపు దూసుక పోతున్నది. సమీప భవిష్యత్తులో ఈ సమస్యకు పరిష్కారం దొరకే సూచన కన్పించడం లేదు.

## ఒకప్పుడు దేశానికే ఆదర్శం!

విద్యుత్ ఉత్పత్తి, సరఫరా, పంపిణీ, వ్యవస్థాగత సంస్కరణలలో ఒకప్పుడు మన రాష్ట్రం దేశానికే ఆదర్శంగా నిలిచింది. నార్ల తాతారావు ఏపిఎస్ఇబి అధినేతగా వున్నప్పుడు ఆంధ్రప్రదేశ్ విద్యుత్ మిగులు రాష్ట్రం. కానీ ఇప్పుడు పరిస్థితి తిరగబడింది. అంతా తారుమారైపోయింది. మన మొత్తం విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం దాదాపు 9వేల మెగావాట్లు. కానీ అవసరం – 12వేల మెగావాట్ల వరకు వుంది. ఉత్పత్తి అధికమైనా కాకపోయినా, అవసరం మాత్రం ఏటికేడాది పెరుగుతూ పోతూనే వుంటుంది. అవసరానికి, ఉత్పత్తికి సమతౌల్యం సాధించడంలో ప్రభుత్వం విఫలం కావడం వల్లనే ఇప్పటి సంక్షోభం తలెత్తింది.

## నీటి ప్రాజెక్ట్‌లపైనే ఆధారపడ్డారు!

ఈ సమస్యకు మరొక కారణం – విద్యుత్ ఉత్పత్తిలో హైడ్రో జనరేషన్ (నీటి పారుదల ప్రాజెక్టుల ద్వారా జరిగే ఉత్పత్తి) మీద అధికంగా ఆధారపడడం. మన రాష్ట్రంలోని 9వేల మెగావాట్ల ఉత్పత్తిలో బొగ్గు, గ్యాస్‌ల ద్వారా జరుగుతున్నది 5వేల మెగావాట్లయితే, నీటి మీద ఆధారపడినది 4వేల మెగావాట్లు. నీటి ద్వారా విద్యుత్ ఉత్పత్తి చేయడం చాలా చవక. కానీ, ఆ నీరు ఏడాది పొడుగునా లభించదు. సంవత్సరంలో ఆరు నెలలకు మించి నీటి లభ్యత వుండదు. దానితో వర్షాలు ఆలస్యమైతే రాష్ట్రంలో చీకటి అలముకొంటున్నది. మొత్తం అవసరాలకు తగినస్థాయిలో బొగ్గు, గ్యాస్ వంటి విద్యుత్ కర్మాగారాలు నిర్మించుకొని, వర్షాకాలంలో నీరు లభ్యత వున్నప్పుడు మాత్రం వాటిని మూతపెట్టి, హైడ్రో జనరేషన్ మీద ఆధారపడితే, ఈ సమస్య తలెత్తదు. కానీ అవసరాలకు, సరఫరాకు మధ్య అంతరాన్ని నీటి ఆధారిత విద్యుత్ ద్వారా తీర్చాలని చూడడం మన ప్రణాళికా రచయితలు చేసిన పెద్ద పొరపాటు.

## విఫలమైన గ్యాస్ ఉత్పత్తి!

ఇప్పుడు నీటి వలనే, గ్యాస్ కూడా విశ్వసనీయత లేనిదైపోయింది. కృష్ణ, గోదావరి బేసిన్‌లో రిలయన్స్ కంపెనీ త్రవ్విన గ్యాస్ బావులపై ఆధారపడి చాలా విద్యుత్ కర్మాగారాలు నిర్మించారు. కానీ గ్యాస్ ఉత్పత్తిలో రిలయన్స్ దారుణంగా విఫలమైంది. దానితో గ్యాస్ ఆధారిత విద్యుత్ కర్మాగారాలు మూత పడుతున్నాయి. మరొకప్రక్క బొగ్గు కూడా సమస్యగా మారింది. సింగరేణి, ఒరిస్సాలోని మహానది గనుల నుంచి వచ్చే బొగ్గు మీద మన థర్మల్ కేంద్రాలు ఆధారపడి వున్నాయి. అయితే ఈ రెండు ప్రధాన వనరుల నుంచి వచ్చే బొగ్గు అవసరానికి తగినట్లుగా లేదు. దానితో కొంతమేర విదేశీ బొగ్గు దిగుమతులు చేసుకోక తప్పడం లేదు. కానీ ఇటీవలి కాలంలో ఇండోనేషియా వంటి దేశాలు బొగ్గు సరఫరా మీద ఆంక్షలు విధించాయి. దానితో బొగ్గు ధరలు పెరిగిపోయాయి. దిగుమతి చేసుకొన్న బొగ్గుతో విద్యుత్ ఉత్పత్తి ఖరీదైన వ్యవహారంగా మారింది.

## విద్యుత్ చార్జి పెంచితే ఊరుకోరు!

విద్యుత్ ధరలకు రాజకీయ ప్రాధాన్యత జాస్తి. ఏ మాత్రం ధర పెంచినా ప్రజల నుంచి తీవ్ర వ్యతిరేకత వస్తున్నది. ప్రభుత్వాల మనుగడను శాసించే స్థాయిలో వుంటున్నది. అందుకొక ఉదాహరణ – చంద్రబాబు నాయుడు పతనం. 1995లో విద్యుత్ సంస్కరణలు మొదలు పెట్టినప్పుడు ఆయన్ను యావత్ ప్రపంచం ప్రశంసలతో ముంచెత్తింది. నూతన తరం నేతగా అభివర్ణించింది. కానీ ప్రజలు మాత్రం ఆయన్ను చరిత్ర చెత్తబుట్టలోకి విసిరివేశారు. సంస్కరణల పేరిట విద్యుత్ ధరలు పెంచకుండా నిగ్రహం పాటించి వుంటే మన రాష్ట్రంలో రాజకీయాలే వేరుగా వుండేవనడం నిజం. విద్యుత్ ధరలకు అంతటి రాజకీయ ప్రాధాన్యత వుండబట్టే ఈ ప్రభుత్వం కూడా ఆ నిప్పుతో చెలగాటమాడలేక పోతున్నది. దీనికి మరొక ప్రత్యామ్నాయం – సాంప్రదాయ విద్యుత్ ఉత్పత్తి మార్గాలను అభివృద్ధి చేసుకోవడం. ఆ రంగంలో ప్రధానమైనవి – సూర్యకాంతి, గాలి.


సౌర విద్యుత్ ప్లాంట్.

## సూర్యకాంతితో విద్యుత్ ఉత్పాదన ఉత్తమం!

మన రాష్ట్రంలో సూర్యకాంతి ఆధారిత విద్యుత్ ఉత్పత్తికి ఎంతో అవకాశం వుంది. కానీ దురదృష్టవశాత్తు ఇంతకాలం ప్రభుత్వం దాని మీద తగిన దృష్టి పెట్టలేదు. ఈ విషయంలో గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడి దేశానికే ఆదర్శంగా నిలిచాడు. తమ రాష్ట్రంలో వున్న బంజరు భూములనే కాదు, నీటిపారుదల కాలువలను సైతం ఇందుకోసం వినియోగిస్తున్నది గుజరాత్. సౌర విద్యుత్ కేంద్రం స్థాపన ఖరీదుతో కూడుకున్న వ్యవహారం. కానీ దాని నుంచి ఉత్పత్తి అయ్యే విద్యుత్ చాలా చవకైనది. మన రాష్ట్రంలో కనీసం 15వేల మెగావాట్ల సౌర విద్యుత్ ఉత్పత్తికి తగినంత భూమి, ఇతర వనరులు లభిస్తాయని అంచనా. కానీ ఆ రంగంలో ప్రయత్నం దాదాపు శూన్యం.

## గాలి విద్యుత్ ఇంకా సులభం!

గాలి ద్వారా విద్యుత్ విషయమూ అంతే.


పవన విద్యుత్.

రాయలసీమ జిల్లాలు గాలి విద్యుత్‌కు ఎంతో అనుకూలమైనవని దశాబ్దాల క్రితమే నిపుణులు నిర్ధారించారు. అయితే దాహమైనప్పుడు బావి త్రవ్వుకొన్నట్లు, కరెంటు కోతలతో జనం అల్లాడుతున్న ఈ సమయంలో గాలి ఆధారిత విద్యుత్ ఉత్పత్తికి ప్రణాళికలు తయారు చేయమని పురమాయిస్తున్నాడు మన ముఖ్యమంత్రి. రానున్న పదేళ్లలో పది వేల మెగావాట్ల గాలి ఆధారిత విద్యుత్ ఉత్పత్తికి ప్రణాళిక రచించమని అధికారులను ఆదేశించాడు కిరణ్ కుమార్ రెడ్డి. ఎన్నో ఏళ్ల క్రితం జరగవలసిన ప్రయత్నం ఇది.

## ఉచిత విద్యుత్ కొంపముంచింది!

విద్యుత్ రంగ సమస్యలకు మరొక ప్రధాన కారణం – వ్యవసాయ వినియోగం. వ్యవసాయ విని యోగానికి సబ్సిడీ అందించే సాంప్రదాయానికి తొలిగా ఎన్టీరామారావు నాంది పలికాడు. దానితో అప్పటి వరకు లాభాలలో వుండిన ఎలక్ట్రిసిటీ బోర్డు నష్టాలు చవి చూసింది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వచ్చిన తర్వాత వ్యవసాయ వినియోగం మొత్తం ఉచితంగా మార్చాడు. దానితో విద్యుత్ సంస్థల నష్టాలు ఆకాశానికి ఎగబ్రాకాయి. వాటిని పూడ్చే శక్తి ప్రభుత్వ బడ్జెట్‌లకు లేకుండా పోయింది. ఆ ఊబిలో నుంచి బయటపడాలంటే, విద్యుత్ వినియోగ చార్జీలు పెంచాలి. అందుకు చిన్న ప్రయత్నం చేసినా ప్రజల నుంచి ప్రతిఘటన వస్తున్నది. పరిష్కారం లేని సమస్యగా మారుతున్నది.

మన రాష్ట్రంలో వ్యవసాయ మోటార్ల సంఖ్య 24 లక్షల వరకు వుందని అంచనా. మొత్తం విద్యుత్ వినియోగంలో 35శాతం వరకు వీటికి పోతున్నది. అంత మేరా భారాన్ని బిల్లులు చెల్లించే ఇతర వినియోగదారుల మీద మోపాలి. అందువల్లనే మన రాష్ట్రంలో పరిశ్రమలకు వాడే విద్యుత్ చార్జీ దేశంలోనే అత్యధికంగా వుంది. దాని వల్ల పారిశ్రామిక అభివృద్ధి కుంటుపడుతున్నది. మన పరిశ్రమలు ఇతర రాష్ట్రాల వారితో పోటీ పడలేక పోతున్నాయి.

## సమస్య పరిష్కారానికి పదేళ్లు పడుతుంది!

ఒక పక్క చాలీ చాలని ఉత్పత్తి, మరొకప్రక్క రాబడి లేని వ్యవసాయ వినియోగం, మూడవ ప్రక్క సరఫరా నష్టాలను తగ్గించే ప్రయత్నం జరగక పోవడం, వీటన్నిటికి తోడు రెండేళ్లకొకసారి ముంచు

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్



ఇదిగో వంద సీట్లు తీసుకో...!

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com